Statement about ownership and other particulars about newspaper GRIHALAKSHMI to be published in the first issue every year after the last day of February.

**FORM IV**

(See Rule 8)

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | ... | Madras. |
| 2. | Periodicity of its publication | ... | 15th of every month. |
| 3. | Printer's Name | ... | Dr. S. Seshagiri Rao. *For* Lodhra Press. |
| | Nationality | ... | Indian—Hindu |
| | Address | ... | 15, West Cott Road, Madras-14 |
| 4. | Publisher's Name | ... | Dr. S. Seshagiri Rao. For Kesari Kuteeram Private Ltd. |
| | Nationality | ... | Indian—Hindu. |
| | Address | ... | 15, West Cott Road, Madras-14. |
| 5. | Editor's Name | ... | Sri C. C. Punniah, Ag. Editor. |
| | Nationality | ... | Indian—Hindu. |
| | Address | ... | 15, West Cott Road, Madras-14. |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | | Mrs. K. Sarada Nedungadi. Dr. S. Seshagiri Rao. Dr. T. M. B. Nedungadi. Mrs. K. Vasantha. } *Shareholders*: 15, Westcott Road, Madras-14 |

I, Dr. S. Seshagiri Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd) S. SESHAGIRI RAO.
Publisher

Date 15-3-57

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] మార్చి 1957 [సంచిక 3

# విషయసూచిక





—:o:—



'ప్రధమ అమెరికన్ నర్తకి'గా పిలువబడు మిస్. రూత్ సెంట్ డేనిస్ 1956 లో వేసవికాలమున జాకబ్స్‌పిల్లోడాన్సు ఉత్సవంలో పాల్గొన్నప్పటి చిత్రమిది. ఇందులోనే గోడమీదిది చరిత్రాత్మక ఆల్బర్ట్ హెర్టర్ చిత్రము. ఈమె 1956 లో నర్తకిగా తాను ప్రారంభించిన జీవితపు 50-వ వార్షికోత్సవమును న్యూయార్కులో జరుపుకున్నది. ఇప్పుడామె వయస్సు 80 అయినా ఎప్పటి ఠీవి, యౌవ్వన లావణ్యములతో నాట్యము చేయుచున్నది.




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# వ్యవసాయము, పశు పోషణ

వ్యవసాయంలోను, పశుపోషణలోను సుశిక్షితవ్యక్తుల అవసరము విశేషముగా కనుపించుచుండుటచే ఆంధ్ర ప్రదేశ్, మద్రాసు రాష్ట్రాలకు కేంద్రప్రభుత్వము ధన సహాయము తలపెట్టింది.

వ్యవసాయమునకు, పశు పోషణకు మన దేశంలోగల సంబంధము చాల సన్నిహితమయినది. కాబట్టే దేశంయొక్క సౌభాగ్యచిహ్నము పాడిపంటలని వింటుంటాము.

వ్యవసాయములో యివ్వనున్న శిక్షణలో రైతులోకం వ్యక్తిగతంగా కష్టనష్టాలకు గురికాకుండా పంటలు సమృద్ధిగా పండించుట ఒక అంశము కావాలి. ఇందుకుగాను రైతుకు వ్యవసాయమున కవసరమగు ఎరువులు, విత్తనాలు, పరికరాలకు ఎక్కువ శ్రమ, ఖర్చు లేకుండా అమరునట్లు ప్రభుత్వము తోడ్పడాలి. వ్యవసాయంలోని ఒడిదుడుకులనుండి రక్షించి ఆత్మ విశ్వాసంతో పండించుట కవకాశములను కలుగజేయు శిక్షణను వ్యవసాయ శాఖ యీయగలదని ఆశిద్దాము.

పశు పోషణ సందర్భమున యివ్వనున్న శిక్షణ పశువులు ఆరోగ్యంగా బలీయములై వ్యవసాయావసరాలను తీరుస్తూ ప్రజావసరాలైన పాలు పెరుగు, వెన్న, నెయ్యి లాంటి ఆహార పదార్థములను సయితం యావత్ప్రజానీకానికి అందుబాటులో నుండే లాంటి అవకాశములను విస్తృతం చేయునట్టిది కావాలి.

ఈ తలపెట్టిన శిక్షణతో మనదేశం మరింత పాడిపంటలతో సౌభాగ్యవంతం కాగలదని ఆశిద్దాం!

## మహిళా సంక్షేమం

ఆంధ్ర ప్రదేశ్‌లో ద్వితీయ ప్రణాళిక కాలంలో మహిళా సంక్షేమశాఖవారు పెక్కు ప్రణాళికల నమలు పరచడానికి కార్యక్రమము రూపొందించారను విషయము సంతోషింప తగినది. ఇందులో మూడు సేవాగృహముల నేర్పాటు చేయుటకు, వెనుకబడిన తరగతులకు చెందిన స్త్రీలకు సాంకేతిక శిక్షణ కేంద్రాలను ప్రారంభించుటకు, సంఘసేవను శాస్త్రీయ పద్ధతులలో శిక్షణ యివ్వడానికి కార్యక్రమం తలపెట్టబడింది.

ఈ కార్యక్రమ నిర్వహణ మూలంగా వెనుకబడిన తరగతుల స్త్రీలు సయితము విద్యా సాంకేతిక విజ్ఞానములతో నలుగురితో బాటు పురోగమించ గలరు. అంతేకాక శాస్త్రీయ పద్ధతులలో సంఘసేవకు శిక్షణనీయడం ఫలితంగా ప్రజా సామాన్యానికి అవసరమైన పరస్పర సహాయ సహకారాలు వృద్ధియయి సంఘసేవయొక్క విలువ దానియొక్క ఆవశ్యకత అర్థముకాగలదు.



# కేసరి విద్యాలయముల వార్షికోత్సవము



మద్రాసు నగరంలో మార్చి 1వ తేదిన సాయంకాలము త్యాగరాయ నగరమందలి కేసరి విద్యాలయముల ఆవరణలో మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారి అధ్యక్షతన కేసరి విద్యాలయముల వార్షికోత్సవము వైభవోపేతముగా జరిగెను. ఉత్సవ సమావేశమునకు రెండు వేలమందికి పైగా ఆంధ్రులు హాజరైరి.

విద్యాలయముల బాలికల ప్రార్థనగీత గానము కాగానే కేసరి విద్యాసంఘపు అధ్యక్షులు డాక్టరు టి. యం. బాలకృష్ణ నెడుంగాడిగారు సమావేశమునకధ్యక్షత వహించుటకుగాను అంగీకరించి వచ్చిన గౌరవనీయులు శ్రీ రాజమన్నారుగారికి, తదితర ప్రముఖులకు స్వాగతము చెప్పుచూ మైలాపూరు, త్యాగరాయనగర ప్రాంతపు తెలుగు బిడ్డల విద్యావసతులకుగాను తమ మామగారు కీ॥ శే॥ డాక్టరు కే. యన్. కేసరిగారొనరించిన సేవలను కృషిని పేర్కొనుట సబబుగా నుండదేమోననిరి. ఆంధ్ర హైకోర్టు హైదరాబాదుకు తరలిపోయి, ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయములు మద్రాసునుండి తరలింపబడుటచే మైలాపూరునందలి కేసరి హైస్కూలులో విద్యార్థుల సంఖ్య క్రమంగా తగ్గుట కవకాశమున్నదనియు, అందుకుగాను దూరదృష్టితో విద్యాలయముల నిర్వాహక వర్గమువారు అవసరమయినచో కొంతకాలమునకు హైస్కూలును త్యాగరాయనగరు నందలి కేసరి విద్యాలయముల ఆవరణకు తరలించుటకు నిశ్చయించినదనియు, అందుకనే త్యాగరాయనగర మందలి తెలుగు బాల బాలికల తల్లిదండ్రుల దృష్టి నాకర్షించి యీ విద్యాలయముయొక్క అభివృద్ధికి గాను వారి సహాయ సహకారముల నర్థించుటకు యీ వార్షికోత్సవము యీ సంవత్సరము యిక్కడ జరుపుటకు నిశ్చయించినామని చెప్పి శ్రీ రాజమన్నారుగారిని అధ్యక్షస్థానము నలంకరించి కార్యక్రమమును జరిపించవలసినదిగా కోరిరి.

సభాధ్యక్షులు శ్రీ పి. వి. రాజమన్నారుగారు ఆంధ్ర బాల బాలికలకు మాతృభాషలో విద్యావసతులకుగాను కీర్తిశేషులైన డాక్టరు కేసరిగారు చేసిన సేవను, వదాన్యతను ప్రశంసించుచు శ్రీ కేసరిగారిని తమకు చిన్నప్పటినుండియు తెలుసుననియు, తమకుగాని, తాము చేస్తుండిన ధర్మకార్యాలకుగాని ఆడంబరమైన ప్రచారమునకు ప్రాకులాడినవారు కారనియు, ఆయన లక్ష్యసిద్ధి నుద్దేశించినట్టివారని చెప్పి, కేసరి విద్యాసంఘ కార్యదర్శిగా దాని కార్యక్రమాలు నిర్విఘ్నంగా కొనసాగించుటకు నిర్విరామంగా కృషి సల్పుచున్న దివాన్ బహదూరు శ్రీ బండి శ్రీహరిరావు నాయుడుగారిని అభినందించారు.

ఆంధ్రప్రదేశ్ విడిపోయి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడినా మద్రాసు నగరంలో కేసరి విద్యాలయములలాంటి వాని అవసరం తీరిపోయినదనుకొనుట పొరబాటనియు, వానియొక్క అవసరము ఎల్లకాల ముండును కాబట్టి మద్రాసునందలి తెలుగువారు అన్ని విధాల కేసరి విద్యాలయముల పురోభివృద్ధికి తోడ్పడి తమ బాల బాలికలకు మాతృభాషలోగల విద్యాసౌకర్యావకాశములను వినియోగించుకోవలసియున్నదని చెప్పిరి.

బాల బాలికలకు బహుమతులు పంచిపెట్టబడినవి. కేసరి ఎడ్యుకేషన్ సొసైటీ కార్యదర్శి కేసరి విద్యాలయముల 1956 57 సం॥ వార్షిక నివేదికను సమర్పించుచు మద్రాసులో తెలుగు పిల్లల విద్యాభివృద్ధికి కృషిచేస్తున్న కేసరి విద్యాసంఘానికి ఈ సంవత్సరారంభంలో 4 వేల రూపాయలను విరాళంగా యిచ్చిన శ్రీమతి పి. భానుమతి, శ్రీ రామకృష్ణలకు, సంవత్సరానికి వెయ్యి రూపాయల చొప్పున నాలుగు వేల రూపాయలను విరాళంగా యివ్వడానికి వాగ్దానంచేసిన శ్రీమతి లక్ష్మీరాజ్యం గారికి, వెయ్యినూట పదహార్లు వాగ్దానం చేసిన శ్రీ

కందుకూరి విశ్వనాథంగారికి కార్యదర్శి శ్రీబండి శ్రీహరిరావు నాయుడుగారు కృతజ్ఞత తెలిపారు.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారొసగిన రు. 5000/- విరాళముతో త్యాగరాయనగర్ నందలి విద్యాలయాల వెంకటేశ్వర ప్రార్థన హాలు విస్తరణ శ్రీ సి. సత్యనారాయణ బ్రదర్స్‌వారు పూర్తి గావించారు. గత ఆగష్టు 31 వ తేదీన శ్రీ యార్లగడ్డ రామనాథబాబుగారు (కారంచేడు) ప్రారంభోత్సవం చేశారు. ఆనాటి సమావేశమునకు ప్రముఖ సినిమా నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. వారిద్దరు విద్యాలయముల పురోభివృద్ధికి సంపూర్ణ సహాయ మివ్వగలమని వాగ్దానం చేశారు.

భరణీ పిక్చర్స్ అధినేతలు శ్రీ పి. రామకృష్ణ, దంపతులు త్యాగరాయ నగరునందలి విద్యాలయములకు వచ్చి మాధ్యమిక పాఠశాల నిర్వహణకు తోడ్పడుటకుగాను రు. 4000/- విరాళమును వాగ్దానం చేశారు. అందుకుగాను మాధ్యమిక పాఠశాలలో నొక గదికి వారి పేర్లు పెట్టుటకు నిశ్చయింపబడెను. వారి వాగ్దానమును స్వీకరించి, వారి చిత్రపటం మాజీ కేంద్రమంత్రి శ్రీ వి. వి. గిరిగారిచే ఆవిష్కరించబడెను. వర్తక ప్రముఖులు శ్రీ కె. విశ్వనాథంగారు 1116/-లు విరాళ మిచ్చినందుకు, రాజ్యం పిక్చర్స్ శ్రీమతి లక్ష్మీరాజ్యం ఏటా రు. 1000/- ప్రకారం నాలుగు సంవత్సరములలో రు. 4000/-లు యిచ్చునట్లు వాగ్దానం చేసినందుకు, డాక్టరు కేసరిగారి కుమార్తె శ్రీమతి శారదాదేవిగారు క్రిందటి సంవత్సరములాగనే వార్షికోత్సవ ఖర్చులకుగాను రు. 100/-లు, కేసరి మిడిల్ స్కూలుకు రేడియో సెట్టునుగాను శ్రీమతి కే. యస్. స్వామినాథఅయ్యర్ గారిచ్చిన రు. 150/- విరాళములకు మేము చాల కృతజ్ఞులము.

కేసరి విద్యాలయముల పురోభివృద్ధిని విశదీకరిస్తూ శ్రీ శ్రీహరిరావు నాయుడుగారు క్రింది నివేదికను సమర్పించారు :-

## మైలాపూరు కేసరి హైస్కూలు

ఈ విద్యాలయము 10-9-1940 న మైలాపూరు, రాయపేట యందలి తెలుగు బాల బాలికలకు మాతృభాషలో విద్యావసతులకుగాను 50 మంది విద్యార్థుల సంఖ్యతో ప్రాథమిక పాఠశాలగా ప్రారంభించబడెను. 1941 సంవత్సరాంతమునకు విద్యార్థుల సంఖ్య 65 కు పెరిగెను. 1943 లో కీ. శే. డాక్టర్ కె.యస్. కేసరిగారు విద్యాలయ నిర్వహణను స్వీకరించి నప్పటి నుండి కేసరి విద్యాలయముగా రూపొందెను. క్రమంగా మాధ్యమిక పాఠశాలయయి దాని నిర్వహణకుగాను కేసరివిద్యానిధి ఏర్పాటు చేయబడెను. 1944-45 లో మాధ్యమిక తరగతులు ప్రారంభమయి 1945 జూలైలో 4వ ఫారం ప్రారంభించి హైస్కూలుగా రూపొందెను. మొట్టమొదటి ఎస్. ఎస్. ఎల్. సి. జట్టు 1948 లో పరీక్షకు కూర్చొనెను.

గత మూడు సంవత్సరములలో విద్యార్థుల సంఖ్య తగ్గింది. అందుకు ఆంధ్రరాష్ట్రం విడిపోవుట, హైకోర్టు గుంటూరులో ఏర్పడుట, ఆంధ్ర ప్రభుత్వం కార్యాలయాలు మదరాసునుండి బదిలీయగుట కారణం.

ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. వెంకటరాజాగారు గాక, జనవరి నాటికి 6 గురు ఎల్. టి. అసిస్టెంటులు (అందులో నలుగురు స్త్రీలు) కలరు. పదిమంది సెకండరీగ్రేడ్ అసిస్టెంటులలో నలుగురు స్త్రీలు. వీరు గాక ఒక డ్రాయింగ్ టీచరు, యిద్దరు వ్యాయామ క్రీడల శిక్షణోపాధ్యాయులు (ఒక స్త్రీ), వృత్తి విద్యా టీచరు, యిద్దరు మొదటిగ్రేడు తెలుగు పండితులు, సంస్కృతమును, తెలుగును బోధించగల యిద్దరు రెండవ గ్రేడు తెలుగు పండితులు, ఒక హిందీ పండితుడు కలరు.

ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలో 1955 సం॥ 75 మంది విద్యార్థులు పాల్గొని 1956 మార్చిలో 54 మంది పాల్గొని గత సంవత్సరం 24 మంది ఉత్తీర్ణులుకాగా 1956 లో 35 మంది ఉత్తీర్ణులైరి.

విద్యా ఉపన్యాస వ్యాసరచన పోటీలు తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు, హిందీలలో ఏర్పాటు చేయబడినవి.

విద్యార్థులు అనేక చర్చలలోను, వినోద కార్యక్రమములలోను, యునెస్కో ప్రసారంలాంటి హైస్కూలు ప్రత్యేక కార్యక్రమములలో పాల్గొనిరి.

వార్షిక ఆటల పోటీలు 1955-56 లో నిర్వహించబడి, చీఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ ఇన్స్పెక్టరు శ్రీ కె. పద్మనాభ నాయుడుగారు యోగ్యతా పత్రములను, బహుమతులను పంచిపెట్టిరి.

విద్యాలయము రాష్ట్రీయ భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్‌కు అనుబంధముగా నున్నది.
రిపబ్లిక్, స్వాతంత్ర్య దినోత్సవములు యథావిధిగా జరుపబడెను. బాలురకు, బాలికలకు ప్రత్యేకముగా నున్న ఎ. సి. సి. లో 121 మంది బాలురు, 50 మంది బాలికలు కలరు.

1955-56 లో విద్యాలయము టీచింగ్ గ్రాంటుగా పొందినది రు. 20477/-. విద్యాలయము రు. 2500 లు మిగులు అంచనాతో నిర్వహించబడినది.

## కేసరి మిడిల్ స్కూలు

కేసరిమిడిల్ స్కూలు 1952-53 లో 1, 2 ఫారములలో 46 మంది విద్యార్థులతో ప్రారంభించబడెను. 3 వ ఫారం 1953 లో ప్రారంభించబడెను. మూడు తరగతులలో 1953-54 లో విద్యార్థుల సంఖ్య 76 కు పెరిగెను. క్రమంగా 1955-56 లో 93. ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయాల బదిలీవలన 10 మంది విద్యార్థులు స్కూలు వీడినను 1955 డిసెంబరు ఆఖరుకు 106 కు విద్యార్థుల సంఖ్య పెరిగెను.

ప్రధానోపాధ్యాయిని కాక యిద్దరు సెకండరీ గ్రేడ్ అసిస్టెంట్లు, డ్రాయింగ్ డ్రిల్లు వృత్తి విద్యల బోధించగల ఉపాధ్యాయుడుగలరు.

1955-56 కు టీచింగ్ గ్రాంటుగా లభించినది రు. 4140. నిర్వాహకులు మంజూరు చేసినది రు. 1117. (ఇందులో రు. 15,000 నిధిపై ఆదాయము చేరియున్నది.)

ఈ పాఠశాలను స్వయం పోషకముగా నొనర్చుటకుగాను ఉదారులగు యీ ప్రాంతపు ప్రజా బాహుళ్యమునుండి విరాళముల సేకరించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. వాని ననుసరించియే వివరించిన విరాళములు సేకరించబడుచున్నవి.

## కేసరి తెలుగు ఎలిమెంటరీ స్కూలు

ఈ విద్యాలయము 1949 లో 48 మంది విద్యార్థులతో ప్రారంభించబడి 1955 లో 155 కు వృద్ధిగాంచెను. 1-10-53 లో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ఫలితంగా విద్యార్థుల సంఖ్య 1954 చివర 128 కి తగ్గెను. మరల 1955 చివర 186 కు, 1956 నవంబరుకు 201 కి పెరిగెను.

ప్రధానోపాధ్యాయిని శ్రీమతి పి. పద్మావతి కాక ముగ్గురు ఎలిమెంటరీ హైయర్ గ్రేడ్ అసిస్టెంట్లు, ఒక సెకండరీ గ్రేడ్ అసిస్టెంటు, ఒక కిండర్ గార్టన్ సెకండరీ అసిస్టెంటులున్నారు. ఆరుగురిలో అయిదుగురు ఉపాధ్యాయినులు.

1956 లో లభ్యమైన గ్రాంటు రు. 7310/-; ఖర్చు రు. 6260/-; విద్యాలయం స్వయం పోషకముగా నున్నది.

ప్రాథమిక, సెకండరీ విద్యా విధానములలో రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టిన మార్పుల ఫలితంగా 7-వ ఫారమును కేసరి హైస్కూలులో ప్రారంభించుటకు సుమారు ఒక లక్ష రూపాయలు వెచ్చింపవలయునట్లు ఏర్పడుచున్నది. కాబట్టి ఈ సంఘ కమిటీ, మద్రాసు నగరవాసులు ఉదారముగా విరాళములిచ్చి కమిటీకృషిని ప్రోత్సహించి సహాయపడవలసినదిగా విజ్ఞప్తిచేయుచున్నదని సెక్రెటరీగారు చెప్పిరి.

విద్యార్థుల నృత్య నాటక ప్రదర్శనాల అనంతరము కేసరిహైస్కూలు హెడ్మాస్టరు శ్రీ కె. వెంకటరాజుగారి వందన సమర్పణముతో ఉత్సవ కార్యక్రమము ముగింపుకు వచ్చెను.

ఈ ఉత్సవ సందర్భమున కేసరి మిడిల్ స్కూలు ప్రధానోపాధ్యాయిని శ్రీమతి టి. వసంతలక్ష్మిగారు చేసిన ఏర్పాటులు ప్రత్యేకముగా పేర్కొనదగినవి.

# మా వినోదయాత్ర

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ



(గతసంచిక తరువాయి)

ఔరంగాబాదు నుంచి 30-12-'56 రాత్రి 8 గంటలకల్లా బయలుదేరి స్టేషనుకు చేరుకున్నాం. మాబండి అక్కడినుండి దాదాపు అర్ధను రేయికి బయలుదేరింది. అది తెల తెలవారుతూండగా నిజామాబాదు స్టేషను చేరడంతో ఆంధ్రరాష్ట్ర సరిహద్దులకు వచ్చామని మనస్సుకు కొంచెం స్థాయి కుదిరింది. వెంటనే దంతధవనాలు ముగించుకొని స్టేషను స్టాలునుంచి సప్లయి అయిన కాఫీ ఫలహారాలు సేవించాం. మా బండి 10 గంటల ప్రాంతానికి సికిందరాబాదు రైల్వేస్టేషనుకు వచ్చి ఆగింది. స్టేషనులోగడ మా పాఠశాలలో గణిత శాస్త్రాధ్యాపకులుగా వుండిన శ్రీ ఆలపాటి నాగేంద్రంగారు, మద్రాసు సిటీ సివిల్ కోర్టు చీఫ్ జడ్జిగా నుండి ప్రస్తుతం విశ్రాంతి తీసుకొంటూవున్న శ్రీ ఏ. రంగనాథం సెట్టి, బి.ఏ., బి.యల్. గారు మాకు స్వాగత మిచ్చారు.

సికిందరాబాదులో విశాలమైన మైదానంలోని హిందూ బాలుర హాస్టల్లో మాకు బస యేర్పాటయింది. అక్కడికి 12 గంటలకు చేరి స్నానపానాలు కాజేసుకొని ముందునాటి రాత్రి తయారు చేసి తెచ్చుకొన్న చిత్రాన్నం పెరుగన్నం తిన్నాం. వెంటనే హైదరాబాదులో చూడదగిన ప్రదేశాలు చూడటానికి బయలుదేరాము. ఆనాడు ఆదివారం; గనుక వ్యాపార వ్యాపారాలు బంద్. వీధులు చాలా విశాలం. భవనాలు వున్నతాలూ. సౌందర్యవంతాలు ముస్లిం హిందూ శిల్పకళా కౌశల ప్రదర్శకాలు.

ఆంధ్ర రాష్ట్రానికి తగిన రాజధాని లేదనే కొరత హైదరాబాదు చూడగానే తొలగిపోయింది. శాసన సభా సమావేశానికి, హైకోర్టుకు, సెక్రెటేరియటుకు అద్భుతములైన గొప్ప కట్టడాలు అమరివున్నాయి మంత్రుల బంగళాలు దేవేంద్ర సదనాలు. ఇక ప్రభుత్వోద్యోగులు నివసించటానికి రెండు చోట్లలో ఇండ్లు కట్టబడ్డాయి. ఆ రెంటికీ సనత్ నగర్, గరీబ్ నగర్ అని పేర్లు. ఈ పట్టణ ద్వయంలోని పలు చోట్లకు రాకపోకలకై విస్తారంగా బస్సుల సౌకర్యం వున్నది. సికింద్రా - హైద్రాబాదులను 'హుసేన్ సాగర్' అనే బ్రహ్మాండమయిన సరస్సు వేరుచేస్తుంది. దీనికోవంక 'మెరీన్ డ్రైవు' చేయటానికి వెడల్పైన రోడ్డూ, మరొకవంక పెద్ద పెద్ద చట్టురాతి తిప్పలు వున్నాయి. విచిత్రమేమంటే, ఆ చట్టురాతి గుండ్లలో ఒక్కొక్కదానిమీద ఒక్కొక్క చిన్న బంగళా వుండటం. సాధారణంగా అవి అధికార్లకూ, శ్రీమంతులకూ సంబంధించినట్టివి. ఎత్తైన ఆ తిప్పల మీది నుంచి చూచేవారికి రెండు నగరాలు చాలా దూరం వరకూ వ్యాపించివుండటం కనబడుతుంది. హైదరాబాదు నగరం మూసీనది వొడ్డున వుంది.

హైదరాబాదులో ముఖ్యంగా దర్శనీయాలు కొన్ని వున్నాయి. కాని, మేము ఆనాడు రెండు మూటినిగాని ఎక్కువగా చూచే అవకాశం లేకపోయింది. (1) మక్కామసీదు :— పూర్వం నైజాము వంశపు నవబు ఒకడు మక్కాకు యాత్రచేసి, అక్కడ మహమ్మద్ ప్రవక్త చిహ్నమయిన వస్తువు తెచ్చి తన నగరంలో భూస్థాపితం చేసి, యీ మసీదు కట్టినాడట ! ఇది చక్కగా మల్చిన చలవరాళ్ళతో చాలా విశాలంగా నిర్మించబడి, జీవకళ వెలిబిమ్మే శిల్ప సౌందర్యం కలిగింది. దీని కొక పార్శ్వంలో హైదరాబాదు సుల్తానుల - వారి భార్యల సమా

ఖులూ — వున్నాయి. (2) చార్మినార్ :— ముస్లిం సంప్రదాయ ప్రకారం "నాలుగు ప్రక్కల గోపురాలు గలది' అనే అర్థమిచ్చే యీ కట్టడం రాచబాటకు మధ్య నిర్మించబడింది. దీని క్రింది ఆవరణంలో సాయంకాలం ఆబాలవృద్ధం వాయుపారణకు వచ్చి, విశ్రాంతిగా పిచ్చాపాటి మాట్లాడుతూ కాలక్షేపం చేస్తారు. నగర లక్ష్మికి ఈ నాలుగు గోపురాల మండపం క్రీడామందిరం వంటిది. పుర మధ్యంలో శోభలు చిమ్ముతుండే యీ అందమయిన కట్టడాన్ని గూర్చి కొంతవరకు తెలుసుకోవటం అవసరం కాకపోదు.

ఇది గోల్కొండకు నవాబుగా వుండిన మహమ్మద్ కూలీషా క్రీ. శ. 1501 లో కట్టించాడు. కాని యెందుకలా కట్టించాడో సరియైన చారిత్రకాధారాలు మాత్రం కనిపించటం లేదు. 16 వ శతాబ్ధంలో ప్లేగు జాడ్యం ఆ ప్రాంతంలో అల్లుకొన్నప్పుడు హైద్రాబాదు పట్టణాన్ని దానినుండి విమోచించటానికై కట్టించాడని పరంపరాగత జనవాక్యం. కాని, రాజమందిరానికి ముఖద్వారంగా నిర్మింప బడిందని కొందరు చరిత్రకారుల సిద్ధాంతం.

క్రీ. శ. 1667 లో - యం. తేవనాట్ (*M. Thevenot*) అనే ఫ్రెంచి యాత్రికుడు హైదరాబాదును సందర్శించి "ఈ కట్టడం నలుచదరంగా నాలుగు గోపురాలతో ప్రకాశిస్తున్నది. క్రింద కమానులు తీర్చబడి వున్నాయి. నేలమీదినుండి ఏడెనిమిది అడుగుల ఎత్తున సోపానాలతో వేదికలు నల్దిక్కులా అమర్చబడివున్నాయి. ఈభవనం చుట్టూ - పూరితో, కట్టె చెక్కలతో, పండ్ల దుకాణాలు ఏర్పడి దాని అందానికి లోపం కలిగిస్తూ వుండినా, నగరానికంతటికీ ఇది బాహ్యంగా నూత్న కళా సంపదను సమకూరుస్తున్నది." అని తెలిపాడు.

మూడు వందల యేండ్లు అయినా. ఈ యసహ్యపు పరిసరాలు ఇంకా అలాగే నిల్చి, చార్మినారు వైభవానికి కళంకం ఆపాదిస్తున్నాయి. అయితేనేం ? ప్రాచీన భారత స్మృతి చిహ్నాలలో ఇది ప్రథమ శ్రేణికి చెందిందని పేరుతెచ్చుకొన్నది.

ఒకానొక పాశ్చాత్య చరిత్రకారుడు, దీన్ని ప్రాచ్యఖండంలోని "ఆర్క్-డీ-ట్రింఫే" (*The Arc-De Triomphe*) అని వర్ణించాడు. 'అర్క్-డీ-ట్రింఫే' —పరాసు దేశంలో ప్రసిద్ధికెక్కిన నిర్మాణం. కాని, చార్మినార్ కంటే అది 25 అడుగుల తక్కువ యెత్తు కలిగింది.

చార్మినారు నాలుగు దిక్కుల కమానులతో 186 అడుగుల ఔన్నత్యం, 100 అడుగుల వెడల్పూ కలిగింది. నేలమీదినుండి కమానులు మాత్రమే 50 అడుగుల యెత్తులో వుంది.

17-వ శతాబ్దంలో మొఘలులు దీనిని ఆక్రమించుకొనే కాలానికి ఈ కట్టడం పిడుగుపాటువల్ల చాలవరకు దెబ్బతినింది. ఆ కొ వ్యయాల కాలంలోనే దీని పునర్నిర్మాణానికి 60,000 రూపాయలు ఖర్చయింది. 18 వ-శతాబ్దంలో పరాసు సేనానిగానున్న 'బుస్సీ' (*Bussy*) కి అతని సైనికులకు దీనిపై అంతస్తులు నివాస స్థలాలు అయినాయి, ఆ తరువాత అవి ముస్లిము మతబోధన కళాగారాలుగా మార్చబడినాయి.

ఐక్య భారతంలో హైదరాబాదు చేరటానికి ముందు, ఈ చార్మినారు గోపురాలను ఎవరూ ఎక్కటానికి నైజాం ప్రభుత్వం అనుమతించేది కాదు. కారణమేమంటే :- అక్కడినుండి నగర సౌందర్యం చూచే వారికి నైజాం రాజభవనం తక్కిన సౌధాల మోస్తరు చిన్నదిగా కనబడటం సహించదగింది కాదని !

ఈ చార్మినారు నుండి గోల్కొండ కోటలోని రాజాస్థానానికి ఆరు మైళ్ళ పొడవు గల సొరంగము వున్నదట. కాని, కొన్నేండ్లక్రిందటి వరకు అది కట్టుకథగా పరిగణింపబడేది. కాని, మూడేండ్లనాడు ఇప్పటి నైజాంగారి మనమడైన 'ముఖ్రంఝా' అనే రాజపుత్రుడు సాయుధ సైనికుల నిద్దరిని, గాజుదీపాల వారిని ఇద్దరిసీ తీసుకొని గోల్కొండకోటలోని రాజ సింహాసనపు క్రింది భూగృహం గుండా దిగివెళ్ళాడు. ఏక కాలంలో ఇద్దరు కలిసి నడువదగినంత వెడల్పు

కలిగి, చార్మినారు వంకకు ఆ సొరంగం మళ్ళడంగను
నించాడు. కాని చాలదూరం నడిచిన తరువాత ఇరు
దిక్కులలోని గోడలమట్టి రాళ్లు, అడ్డంగా కప్పలు
తిప్పలుగా పడి, దారి తెలియనందు నతిరిగి వచ్చేశాడు.
ముందు ముందు పరిశోధకులు దీని విషయం బయలు
పరచగలరని ఆసిద్దాం.

(3) సాలారుజంగు మ్యూజియం :— నైజాం
రాజ్య ప్రధానోగి (రాజ బంధువు) అయిన సాలారు
జంగు కళాప్రియుడు. అతడే ఈవస్తు ప్రదర్శనశాలకు
అంకురార్పణం చేసినవాడు. దీనిలో ప్రతి వస్తువును
గూర్చిన చరిత్రాదిక వివరాలు తెలుసుకోవలెనంటే,
కనీసం మూడురోజులైనా పడుతుంది. లోపలికి వెళ్లి
చూడ దలచినవాళ్లు తలకు 1-0-0 సుంకం చెల్లించాలి.
విద్యార్థులకు సగం రేటు. గదులు గదులుగా విభజింప
బడ్డ ఈ మహా సౌధంలో ప్రతిచోటుకూడా ఒక
కళాకేంద్రం, దంతం, కొయ్య, పింగాణి, గాజు,
మొదలగువాటితోనే కాక ఇత్తడి, కంచు రాగి
యిలాటి పలు రకాలైన లోహాలతో చేయబడ్డ వస్తు
సామగ్రులు అనేకం ప్రాచీన కాలపు చేతి పనుల
నేర్పును సూచిస్తూ వున్నాయి. దాదాపు 500 ఏండ్లకు
పైగా నేయబడ్డ సున్నితాలైన వస్త్రాలు, జిగినీపని
తనం గల పుడుపులు, కవచాలు కనబడ్డాయి. ముస్లిం
హైందవ చిత్రకారుల విచక్షణకు సాక్ష్యమిచ్చే దివ్య
మయిన చిత్రపటాలు, పూర్వపుచేతివ్రాతగల ఉరుదూ
భాషలోని (అచ్చువంటి) ముచ్చట గూర్చే గ్రంథాలు
ఎన్నో వున్నాయి. మొఘలులగది, అసఫ్‌జాలగది,
ఆయుధాలగది గోల్కొండ చిత్రాలగది — దర్శించే
వారికి కొంత వరకు మునుపటి దక్కను
పీఠభూమిలోని నానా రాజ్యాంగాల చరిత్ర
బోధపడుతుంది. మైసూరు రాజ్యాన్ని యేలిన
హైదరు, టిప్పు సుల్తానులకు సంబంధించిన వస్తువులు
గల గదియందు వెండి బంగారుల సామానులు, ఆయు
ధాలు మేము చూడలేదు. ఆ గదిలోకి వెళ్ళాల్లంటే
తలకు ఇంకొక 0-8-0 సుంకం చెల్లించాలి. పైగా
ప్రొద్దుకూడా వాటార సాగింది. మేము క్రింది అవర
ణానికి వచ్చి అక్కడి విశాలమయిన హాలులో ఒద్ది
తీర్చినట్లు పాశ్చాత్య కళానైపుణ్యానికి అలవా
లయిన చలవరాతి విగ్రహాలు, ఆదర్శ గ్రామం నమూ
నా చూచాం. ఒక చోట పింగాణితో చేయబడ్డ
మనిషియెత్తు పురుష విగ్రహం ఒక చిన్న గదిలో
ప్రేక్షణీయంగా అమర్చ బడింది, దాని వెనుక నిలు
వెత్తు అద్దం. విగ్రహం ముందరి భాగం పురుషుడైతే
వెనుకటి భాగం స్త్రీ మూర్తిగా అద్దంలో గోచ
రిస్తుంది. ఔరా! శిల్ప కళ!

ప్రస్తుతం మహాంధ్రానికి ఇది ముఖ్య నగరం, గనుక
దీన్నిగూర్చి సంగ్రహంగా తెలుసుకోవటం అప్రస్తుతం
కాదు.

హైదరాబాదు భారత భూమిలో గొప్ప పురా
లని యెన్నబడిన వాటిలో నాలుగోది. ఇది కూలీ
కుతుబ్‌ఖాన్ అనే రెండవ నైజాము కాలంలో తన
భార్య (భాగ్‌బేగం) పేరట భాగ్ నగరం అనే
పేరుతో కట్టాడు. తరువాత తెలుగువారు దాన్నే
'భాగ్య నగరం' అంటూ వచ్చారు. మొదటి నైజాము
'క్రముద్దీన్‌ఖాన్' ఇతడు 'అసఫ్‌జాహి' వంశస్థుడు.
తరువాత ఈ వంశ నామమే బిరుద నామమయింది.
మూల పురుషుడైన అసఫ్‌జాహి ఔరంగజేబు
చక్రవర్తికి విశ్వాస పాత్రుడయిన సేనాని. చక్రవర్తి
దక్కను మీదికి దండెత్తివచ్చి గోల్కొండను దోపిడీ
చేసినపుడు ఈ అసఫ్‌జాహి తన శక్తి సామర్థ్యాలతో
మొఘల్ ప్రభువును మెప్పించాడు. ఇది క్రీ.శ. 1674
నాటి చరిత్ర. ఇతణ్ణి (అసఫ్‌జాహీని) చక్రవర్తి 'నిజా
ముల్ ముల్క్' — అనే బిరుదుతో సత్కరించి
దక్కను సుబేదారుగా నియమించాడు. అప్పటి
గోల్కొండ నవాబు అబుల్ హాసన్. ఇతడే
తానీషా. ఇతడి కాలంలో హిందువులనూ వారి
మతాన్ని సమరస దృష్టితో చూచేవాడు. అక్కన్న,
మాదన్నలు ఇతడి ముఖ్యమంత్రులు. వీరి మేనల్లుడైన
గోపన్న (రామదాసు) ఖమ్మం జిల్లాలోని భద్రగిరి
తహసీలు పదవిని పొంది సర్కారు సొమ్మున

(163-వ పేజీ చూడుడు)

# తెల్లరోజా!

రచయిత్రి :
ఇన్‌గే షోల్

అనుసరణ :
డాక్టరు వి. ఎన్. శర్మ

## దేశంలో అలజడి

"ప్రజల" కోర్టులు — ఈ యుద్ధ కాలంలో ప్రభుత్వం ఎంత నిరంకుశాధికారాలను అదురూ బెదురూ లేకుండా చెలాయించిందో చెప్పటానికి ప్రారంభిస్తే ... ... కోర్టులు ప్రభుత్వం వారి ఆజ్ఞలను తూ.చా. తప్పకుండా నెరవేర్చటంలో ఎంత వుత్సాహాన్ని చూపాయో మీరు వింటే హడలిపోతారు. ... కోర్టులను "ప్రజల" కోర్టులని పిలిచారు. ప్రజాలోకానికి న్యాయస్థానాలల్లో ఎంతో పలుకుబడివుందని ఇతర దేశాలవారికి తెలపటానికి కోర్టులలో న్యాయమూర్తులు నాజీపార్టీనుంచి ప్రత్యేకంగా ఎన్నుకొనబడ్డవాళ్లే. పార్టీ కోరికలను నెరవేర్చటంలో ఈ జడ్జీల కున్నంత భక్తి, ప్రేమ మాటలతో వివరించలేం! ... నగరాల్లో ఈ కోర్టులు, పట్నవాసాల్లో ఇవే. గ్రామప్రాంతాల్లో ఇవే. ప్రభుత్వాన్నిగాని, నాజీపార్టీనిగాని ప్రతిఘటించిన వాళ్లు, ఈ కోర్టులకు తీసుకొనిరాబడేవాళ్లు. ఆ రోజుల్లో ఇలాటి ప్రతిఘటనలన్నీ రాజకీయ నేరాల క్రిందికే వచ్చేవి. ఈ కోర్టులు ఇలాటి రాజకీయ నేరాలను విచారించటానికి సర్వాధికారాలను చెలాయించసాగాయి. "వూ" అంటే 10, 15 సంవత్సరాల కఠిన కారాగారశిక్ష. "ఆ" అంటే ఉరిశిక్ష. ఇలాటి శిక్షల ననుభవించటానికి గవర్నమెంటు మనం కనని, వినని రాక్షస కృత్యాలను తటపటాయించక ఆచరణలోకి తెచ్చాయి. ... ఇలాటి న్యాయస్థానాల వారు ఇచ్చే జడ్జిమెంటులమీద అపీలు అనేదే లేదు. కోర్టువారు ఇచ్చిన శిక్షను ఆ తక్షణమే అమలులో పెట్టటానికి కట్టుదిట్టాలను ప్రభుత్వం చేసింది. విచారణ రహస్యంగా జరుపబడేది. ఎలాటి సాక్షులు ఆ సమయాన ప్రభుత్వం పక్షాన ప్రత్యక్షమవుతూవున్నారో వింటేనా ... ... "నేరస్థుల" పక్షాన వాదించటానికి ఎవళ్లకి ధైర్యం వుంటుంది ఆ దుర్భరావస్థలో. పైకి అంతా సక్రమంగా జరుగుతూవున్నదని తెలపటానికి ప్రభుత్వంవారే—అంటే "ప్రజా" కోర్టుల న్యాయమూర్తులే వాళ్ళకి నచ్చిన న్యాయవాదులను తాత్కాలికంగా నియమిస్తూ వుండేవాళు. వాళ్ళ కోరికలను చక్కగా నెరవేర్చగలిగారా—ఈ న్యాయవాదులపంట బాగా పండిందే అని చెప్పాలి.

## పత్రికల ప్రచారం

వార్తా పత్రికలు వున్నాయి. ఉదయాన, సాయంకాలాన ప్రతి పెద్ద వూళ్ళో ప్రచురింపబడే పత్రికలు. వారపత్రికలు. మాసపత్రికలు వగైరాలు. అన్నీ "స్వతంత్రాభిప్రాయాల"నే ప్రకటించే పత్రికలని పైకి పేరు. కాని లోపల చూస్తేనా ... ఈ పత్రికలు ప్రకటించేవి ప్రభుత్వంవారు ప్రజాలోకానికి ఆ కాలాన మంచివని అనుకున్న సంగతులే. ... విదేశవార్తలు సున్న. దేశంలో ప్రజలలో గలుగుతూవున్న అలజడిని సూచించేవార్తలు కలికానికికూడ బొత్తిగా కనబడవు. ఇక మనం వాటిలో ప్రతి రోజూ చదివేవి "ప్రజా" న్యాయస్థానాలవారు విచారిస్తూవున్న కేసుల విషయం. ఆ విషయాన్ని పూర్తిగా ప్రచురిస్తేనా! ... ఈ పత్రికలు ఈ సంగతిని గురించి తెలిపేవి — ఒకాయన లేదా ఒకామె, కాకపోతే ఒక ముఠా పెద్ద రాజద్రోహానికి పూనుకొన్నట్లు, లేకపోతే హిట్లరుపట్ల చెప్పరానంత రాజద్రోహానికి పూనుకొన్నదనీ, కోర్టు ఆ సంగతి విచారించి వురిశిక్ష విధించిందనీ, ఆ శిక్ష తక్షణమే అమలులో పెట్టబడిందనే. ... ... నేరస్థుల పేర్లను ప్రకటించరు. వాళ్లు ఏవూరివాళ్ళో, ... ఆ సంగతే సూచించరు. ... ... ఇవ్వాళ ఒక గాయకుడు ప్రభుత్వాధికారాన్ని నిరోధించినందుకు వురితీయబడ్డాడని;

రేపో! ... ఒక ఇంజనీర్, లేదా ఒక కార్మికుడు, లేదా ఒక పెద్ద ఫాక్టరీ యజమాని వురిశిక్షకు గురికానుబోతున్నాడని చదవవచ్చు పత్రికల్లో. వీళ్లు కాకపోతే ఒక మతాచార్యుని పేరుగాని, ఒక విద్యార్థి నామాన్నిగాని, అటుకాకపోతే ఒక పెద్ద మిలిటరి ఉద్యోగిపేరుగాని ఇలాంటి ప్రకటనలలో మనం చదవవచ్చు. వీళ్లంతా రాజద్రోహులని అలాంటివాళ్లని స్వేచ్ఛగా నుండనీయటం దేశానికే అప్రతిష్ఠ అని ఇలాంటి ప్రకటనలలో చెప్పబడుతూ వుండేది. ఇవన్నీ ప్రభుత్వంవారు అనుదినమూ ప్రచురించే ప్రకటనలు. వీటికి సమీపాన్నే ప్రజాకోటి వాళ్ళ వాళ్ళని గురించి ప్రచురించే నోటీసులనుకూడా దినపత్రికలలో కళ్లార చూస్తూ వుండవచ్చు. ఇవీ ఇలాంటి విషాదగాథలే. ఉరిశిక్షలను అమలుజరపటంలో నేరస్థుల దగ్గర బంధువులకు ఆ వార్తను తెలపటం ఆ రోజుల్లో ప్రభుత్వం అంత అవసరంలేదనుకొని, ఆ పనినంతా ప్రభుత్వాధికారుల సమక్షాన్నే యథాతథంగా జరుపుతూ వుండేది. పని అంతా పూర్తి అయిన తరువాతనే ఆ సంగతి బంధువులకు తెలుపబడటం పరిపాటయిపోయింది ఆ రోజుల్లో. అలాంటి పరిస్థితుల్లో "నేరస్థుల" బంధుమిత్రాదులు ఏంచేయగలుగుతారు? మౌనవ్రతాన్ని అవలంబించాలి. అలా చేయడానికి ధైర్యసాహసం లేకపోతే, వాళ్ల వాడు యుద్ధరంగంలో ఎక్కడో తప్పిపోయినాడని పరామర్శచేయటానికి వచ్చేవాళ్ళకి చెప్పాలి. ఇలాంటి నాటకాన్ని ఆడటానికి ప్రజాలోకానికి ఆ రోజుల్లో అలవాటయిపోయింది.

ఇలాంటి ప్రకటనలనేకాక యుద్ధంలో చనిపోయిన వాళ్ళ నామాల్ని పేర్కొంటూ ఎన్నో పేజీల్ని నింపేవి యీ పత్రికలు. ఆ యోధుడు దేశానికోసం ప్రాణాల్ని త్యజించాలసివచ్చిందని, ఈ యోధుడు నాయకుని పేరు ప్రతిష్ఠలను నిలువబెట్టడానికి యుద్ధభూమిలో ప్రాణాలను కోల్పోవాలసివచ్చిందని వార్తలు. వాళ్ళ సేవకు ప్రభుత్వం బంగారు పతాకాల్ని, వెండి మెడల్స్‌ని, అలాంటివి పొందటానికి అర్హతలేకపోతే ఇతర లోహాలతో తయారుచేయబడ్డ పతాకాలు ఈయబడ్డవని ప్రభుత్వం ప్రచురించే వార్తలకు మితివుండేదికాదు.

ఇంతటితో ప్రభుత్వం తృప్తిపడలేదు. "మన కష్టాలకంతా మూలకారణం" ఎవళ్ళైవున్నారో వాళ్ళ దూషణలతో పేజీలు నింపేవి. "మనం చేయాలసిన ప్రార్థన ఇలాంటివాళ్ళని ఏవగించటమే. మన కార్యవిధానాన్ని ప్రతిఘటించటానికి వీళ్లు అడ్డు వచ్చినా భయపడకూడదు. జయం మనదే. ఎలాంటి విషమావస్థలోకూడా ఈ రహస్యాన్ని మరచిపోయామా మన పేరు ప్రతిష్ఠలకే ఎంతో అప్రతిష్ఠను తెచ్చినవాళ్ళమవుతాం. ... అంచేత మన దోవకి అడ్డు వచ్చినవాళ్ళను ధ్వంసంచేయాలి. ఇదే మన ప్రార్థన. ఇలాంటి ప్రార్థన మూలాన్నే మనకు జయం సమకూరుతుంది."

## ఇతర పద్ధతులు

పత్రికలకు మించినవి ఫిల్ములు. రేడియో ప్రచారాలు. ఇవన్నీ ప్రభుత్వం వారి పద్ధతులను సమర్థించటానికీ, ప్రజాకోటిలోని స్వతంత్రాభిప్రాయాలను అణచివేయటానికీ యథాతథంగా వుపయోగించబడ్డాయి. ... ...

పత్రికలలో ప్రచురింపబడే సంగతులు, ఫిల్ము రూపాన చూపబడే ప్రచారపు చిత్రాలు, రేడియో ద్వారా లోకానికి తెలుపబడే విషయాలే ముఖ్యమైనవని గవర్నమెంటువారి ఆలోచన. అంచేతనే ఇలా ప్రచారం ... వీటికన్నా అతిముఖ్యమైన సంఘటనలు ప్రతి రోజూ పట్నాలలో, పల్లెటూళ్ళలో జరుగుతూనే వున్నాయి. చరిత్రలో మనం కననీ, విననీ సంఘటనలు ఇవి అంటే ఆ మాటలో ఏమాత్రము అతిశయోక్తి వుండదు.

## ప్రజలలో అలజడి

మతాచార్యులు ప్రతిచోటా వున్నారు. క్యాథలిక్ మతానికి సంబంధించినవారు, ప్రొటెస్టెంట్

శాఖికి చెందినవారు. ... అంతవరకు ఆ ఇంటికాకి ఈ ఇంటిమీదికి ఎగిరేదికాదు. ... కాని ఈ సందిగ్ధావస్థలో ఇరుపక్షాలవారు ఏకమయ్యారు. ప్రభుత్వవారు, నాజీపార్టీవారు చేసే ప్రచారంలో ఎంత నిజంవున్నదో, ఈ మతాచార్యులకు బాగా తెలుసు. అది అంతా అబద్ధాలపుట్ట అని తెలపటానికి భయపడలేదు. ప్రభుత్వం దారుణకృత్యాలను నిరోధిస్తూ ప్రజాలోకానికి శక్తి సంపదలను ప్రసాదించారు. దానికి ప్రతిఫలం ఖైదుకు వెళ్ళటమే. జైళ్ళలో అనుభవించాలసివచ్చిన అష్టకష్టాలను ధైర్యంతో అనుభవించసాగారు. ఆ సంగతిని పత్రికలు ప్రచురిస్తేనా! ...

పగటి పూట బాంబుల వర్షం; రాత్రిళ్లూ అంతే. ప్రతిరోజూ శివరాత్రి జాగారణమే. ఒక తల్లి విమానాలు తన ఇంటివైపు రావటం గుర్తించింది. అంతకు ముందే ఇలాటి దాడుల మూలాన ఇంట్లో సామానంతా పోగొట్టుకుంది. ఆ చంటి బిడ్డని మాత్రం ఎలాగో కాపాడుకోగలిగింది. ఆ బిడ్డకి కావలసిన వస్తువులని భద్రపరచటానికి చేతిలోచిన్న పెట్టెను కూడా ఎలాగో దాచుకుంది. విమానాలు రానే వచ్చాయి. బిడ్డని హతమార్చాయి. తల్లికి సహాయంగా ఎవళ్ళయినా ఆ సమయాన వస్తేనా? చనిపోయిన పాపను ఒక చంకన బెట్టుకుని, ఆ పాప బట్టల పెట్టెను పుచ్చుకుని అర్ధరాత్రి సమయాన స్మశానస్థలానికి నడుస్తూవున్నది ఈ తల్లి. ఎంత ధైర్యం వుండాలి! ఎంత సాహసంవుండాలి! ఆ తల్లి ఈ బాంబుల వర్షంలో, ఆ కారు చీకటిలో అలా ఒంటరిగా నడవటానికి! ఇలాటి వీర వనితల సంగతి పత్రికలు ప్రచురిస్తాయా? ... ...

జయిళ్లనిండి పోయాయి. ఇతర రకాల ఖైదులూ నిండిపోయాయి. వాటిలోకి చేరుకున్నవాళ్లంతా నిర్దోషులు. ఎవళ్లను వాళ్లే దోషులనే సమర్ధించబూనుకుంటే వాళ్లు చేసిన దోషం దేశాన్ని, ప్రజాలోకాన్ని ఈకాలపు దుర్భరావస్థనుంచి గట్టెక్కించడానికే అని చెప్పిన చాలుగా! వాళ్లంతా వీరులు. ధీరులు. అన్నివిధాల వాళ్లకి చుట్టుకుంటూవున్న కష్టాలని ధైర్యసాహసాదులతో ఎదుర్కొన్నారు. సత్యాగ్రహులంటే వీళ్లని తప్పక పేర్కొనాలి......

యుద్ధరంగాల్లోని దారుణ పరిస్థితులను పేర్కొనాలా? సైనికులు అలసిసొలసి పోయివున్నారు. దోవలో నడుస్తూవుండే పరాయివాళ్ళను ఖైదీలుగా తీసుకోనాలి. వాళ్ళ సంఖ్యమించి పోయిందా అక్కడే కాల్చి మాయంచేయాలి. ఇలా చేయడానికి ఏసైనికుడైనా ప్రతిఘటించాడా వాడి ప్రాణాలు అక్షణాన్నే పోతాయి. ఈ రహస్యం యుద్ధరంగాల్లోనున్న వాళ్ళకంతా తెలుసు. కాని ఆ సంగతి పత్రికల్లోకి మాత్రంరాదు. పత్రికల వాళ్ళకి అలాటి వార్తలను ప్రచురించటానికి దమ్ములు వుంటే కదూ! ......

ఆస్పత్రులు వున్నాయి. విశ్రాంతి మందిరాలు వున్నాయి. వీటన్నిటిలో వున్నవాళ్లు యుద్ధంలో దెబ్బతిని వచ్చినవాళ్లే. ఆ దెబ్బలమూలాన వాళ్లు పడుతూవున్న బాధ ఇంతింతని చెప్పాలా. అవి శారీరకానికి సంబంధించినవేకాదు; మనోవ్యాధులూను. ఆవ్యాధులమూలాన వాళ్లు పడే బాధ చూస్తేనా— ఎంతోమంది ఆ నరకకూపాన్నుంచి బయటబడడానికి, చేసిన కార్యాలనువింటే గడగడ వణకి పోవాలసి వస్తుంది. కాని ఈ పత్రికలు ఈ ఆత్మహత్యల సంగతి వ్రాస్తాయా ..............

ఇంకా ఎన్నెన్నో దారుణమైన వార్తలను వింటూ వుంటాం. ఆరోజుల్లో వాటిలో అనేకమైన వాటిని ప్రత్యక్షంగాచూస్తూ వుంటాంకూడా; కాని అలాటి వార్తలను పత్రికల్లో చదివి తెలుసుకోనటానికి ఈ కాలంలో ఎవళ్లకీ అదృష్టంలేదు. అంతా చీకటి. ఇంట్లో చీకటి. బయట-చీకటి. జ్ఞానసముద్రమంతా చీకటి మయం. ఇలాటి చీకటిమయంలో చిన్నా పెద్ద వుక్కిరి బిక్కిరి అయిపోవాలసి వచ్చిన అధోగతికి ప్రజాలోకాన్ని ప్రభుత్వం ప్రభుత్వయంత్రాన్ని

ఎంతో నిపుణతతో నడుపుతూవున్నామని తృప్తిపడు తూవుండే అధికార్లూ తీసుకునివచ్చారు. ... ...

కాని దేశంలో "ప్రజాక్షేమం కోసమని" "ప్రజా రక్షణ" కోసం అని ప్రభుత్వాధికార్లూ, వాళ్ల వాళ్ల చర్యలని శ్లాఘిస్తూ పక్కతాళాం వేస్తూ వున్న నాజీపార్టీవాళ్ళ పద్ధతులను పత్రికల్లో ప్రకటించటానికి ఆరోజుల్లో పత్రికాసంపాదులకు ధైర్యం వుంటేనా? ప్రభుత్వంవారు ఇచ్చే వాటినే ప్రచురించాలి. వాటిని ప్రతిఘటించారా ప్రతికాధిపతులు ఎలాటి యమయాతనలకు లోనుగావలసి వున్నదో చెప్పతరంకాదు

## దేశంలో అశాంతి

ఈ వాతావరణాన్ని పట్నవాసాల్లో చూడవచ్చు. అంత కన్నా అధికమైన దారుణావస్థను గ్రామవాసులు లోనుగావలసి వచ్చింది. ఏవూళ్లో చూసినా అరెస్టులు. వాళ్ళనంతా నెక్కడికి తీసుకొని వెడుతున్నావో ఎవళ్ళకి తెలుసు? అలా ప్రశ్నించటానికి ధైర్యం వున్నావాళ్లు అనుభవించాలసిన బాధలను తలుస్తూ వుంటేనా! గ్రామాలనిండా పరదేశాలనుంచి తీసుకుని రాబడ్డ ఖైదీలు. వాళ్ళకి తిండీ తిప్పలు అనేవి లేవు. అరవచాకిరి. రాత్రింబగళ్లు ఇలా చేయక పోయారా వాళ్లని చీల్చి చెండాడేవాళ్లు ప్రభుత్వాధికార్లు. ఈయమయాతనల మూలాన లక్షలకొలది యుద్ధఖైదీలు ప్రాణాలను కోల్పోవాలసి వచ్చింది. ఆ సంగతి పత్రికల్లో కనబడితేగా! అంతా రహస్యం. ఈ సంగతి ఆ వూళ్లోవాళ్లకు తెలియకూడదు. బయటివాళ్లకు తెలియనీయకూడదు.

నరకలోకం అనేది ఒకటివుంటే ......అలాటి లోకపు వాతావరణాన్నే మనంఅనుదినం ఈ యుద్ధపు రోజుల్లో ఈ దేశంలో చూడవచ్చు.

పత్రికల సంగతి అటుంచి, ఇకప్రభుత్వం వారు ప్రతిరోజు సినిమామందిరాల్లో చూపెడుతూవుండే చిత్రపటాల సంగతి చూద్దాం. అక్కడ చూపబడే చిత్రాలన్నీ యుద్ధంసక్రమంగా జరిగి పోతూవున్నదనీ, మన శత్రువులను అన్ని రంగాలలో చెండాడుతూ వున్నామనీ, జయం ఇక మనదే అనీ, ఆ జయం అతి త్వరలోనే రాబోతూ వున్నదనే.........
చలికాలం ప్రారంభమైనది. అదీ తన పనిని సాంతంగా కొనసాగించమని మాయమైపోయింది. వసంతకాలం దాంతో ఆరంభమయింది. ఎండాకాలం వచ్చింది.

మళ్లీ చలికాలం వచ్చింది ఇతర ఋతువులను చిందర వందర చేస్తూ, తన దారుణ వాతావరణాన్ని నలుప్రక్కలా వ్యాపింపచేసింది ఈ చలికాలం. కాలచక్రం అలా మారిపోతూవున్నా, ప్రజల కష్టాలు యథాతథంగానే వుండసాగాయి. ఆ సంగతి తలిచే నాథుడు వుంటేనా ఆ దుర్భరావస్థనుంచి ప్రజాకోటిని ఒక దరీదాపుకి తీసుకొని రావటానికి? ...... ప్రజాకోటి ఇన్ని కష్టాల నెదుర్కొంటున్నా, ఆత్మ విశ్వాసాన్ని మాత్రం ఇతర్లకి ఒప్పచెప్పలేదు. "అన్నీ పోతాయి. అలా పోవటం వాటికి సహజం. అలాగే హిట్లర్ పోతాడు. హిట్లర్ అనుచరవర్గమూ నాయకుని దోవనే మాయం అవుతుంది. ఇదీ సహజమేగా! అంత వరకూ ఓపికపట్టి వుండాలి. ఆ వోపికే మనల్ని ఈ యమయాతన నుంచి ఒక దరీదాపుకి చేరుస్తుంది"... ఇటుగోయి; అటు నూయి; ఎటు చూసినా ప్రమాదం; చెప్పరానంత ప్రమాదం. పత్రికలు అగ్ని పర్వతాలు. రేడియో సృష్టించే వాతావరణం అలాటి పరిసరాలని తయారుచేయటానికే ఫిల్ము ప్రచారం వీటికన్న రెండింతలుమించిందే. ఈలాటి అవస్థను ఇంతకుముందు ఎదుర్కొన్నదికాదు. ప్రజ ఇలాటి అవస్థలో స్మరించి, ప్రార్థించేది భగవానుని కరుణా కటాక్షాల కోసం. భగవానుడువాళ్ళను మరచిపోలేదు. ఎన్నటికీ మరచిపోడుకూడా. ఆయన్ని స్మరిస్తూవుంటే తమకష్టాలు వాటంతట అవే పటాపంచలై పోతాయనే నమ్మకం దృఢంగా ప్రజలలో నాటుకుని పోయింది...... ఎంత ఓర్పు! ఎంత శక్తి! ఎంత విశ్వాసం. అవే ఆ కాలంలో ప్రజాకోటిలో లేకపోతే వాళ్ళంతా ఏ విధంగా నాశనమైపోయివుండేవాళ్ళో!

# శ్రీ సాయి భక్త

యస్. బి. కేశవయ్యగారు

ప్రశంసా పద్యములు

శ్రీ కల్లూరు అహోబలరావు

శ్రీయనంతుని పేరఁ జెలువొందు మండల - మందుండు - పెనుకొండ - యనెడు పట్ట
ణంబు; రాయల దివాణములోని కవివరుల్ - కవితల వెలయించి గ్రాలిరచట;
గగన మహాలోకండు, కమలాకరములు, బు - రుజులెన్నియోయుండు; రూఢియైన
దేవాలయములఁ జిత్రితములు, భారత - రామాయణంబుల రమ్యకథలు
కలవు ద్రాక్ష, దాళింబరీ ఫలము లొసఁగు - రమ్య వనములు, రుచ్యజలప్రపూర్ణ
కూపవాపీ తటాకముల్ గొలఁది మీఱు; - ఘనగిరిపురమ్ము - ప్రకృతి చక్కందనమ్ము

ఘనగిరి విలసిల్ల - 'పెనుకొండ'యను సార్థ - కపు నామమబ్బెవిఖ్యాతముగను
♦ షర్డీని వాసియా - సాయిబాబాయొక్క - ఆలయ నిర్మాణమైన దిచట
శ్రీ సాయి భక్తుండు, శ్రీ కేశవార్యుండు - భక్తాగ్రగణ్యుండు బరగదీని
సాయి భక్తులయొక్క సాహాయ్యమునఁ జేసి - నిర్మించె ఘనమైన ధర్మ నిరతి
నిత్యపూజోత్సవంబుల నిష్ఠ, కల్గు - నట్లు చక్కని యేర్పాటు లమరఁ జేసి
కీర్తి కాంతఁ జేఁబట్టె; సన్మూర్తి కేశ - వార్య భక్తుఁ గీర్తింపగా నలవియగునె?

సత్య బద్ధుండఱు - సబ్ రిజిష్ట్రారుగాఁ - జేసెనుద్యోగంబు వాసి గాగ
నేడు వత్సరములు; వేడుకతోఁ జెను - గొండలో, మిత్రులు గొలువ, సాయి
పూజల, గురువారములయందు, శ్రద్ధఁగా - వించె, స్వగృహమునఁ బ్రీతితోడ
వందల కొలఁదిగా భక్తులే తెంచిరి - సాయి పూజోత్సవ సరణిఁ గాంచ
నంతఁ గేశవార్యుఁడు, శుచివంతుఁడగుచుఁ - బూజలొనరించి, ధ్యానించి పూర్ణయోగ
సిద్ధి గడియించి, శక్తి నార్జించి, సాయి నెంచి, చింతించుచుండు; నుడంచితముగ.

కొంత తడవు, సమాధిఁ బ్రశాంత భంగి - స్వాంతమును నిల్పి, శ్రీ సాయి శక్తి తనకు
ప్రేరణమొసంగ, భక్తుల గారవించి - తీర్థము, ప్రసాదము నొసంగు; నర్థివారి
కుశల ప్రశ్నంబులడుగుచుఁ గోర్కెఁ దీర్చు; - భక్త కేశవార్యునుతింప వలను పడదు.

ప్రకృతము, 'షినాయి' నగరంబు (మదరాసు) పరమపూజ్య
భావమును జెందె; కేశవభక్త వరుని
'సాయి' పూజామహత్తు, ప్రజా సమూహ
మెలమి రాబట్టుచుండె; సంవృద్ధిగాఁగ.

ప్రేమ సౌశీల్యముల్-వెల్లివిరియుచుండ - దివ్య పూరుషుఁడయి తేజరిల్లు
ఆధ్యాత్మికపు జ్ఞాన మార్జించి, (శ్రీ)బాబ - శక్తి సామర్థ్యముల్ చాటుచుండు
ప్రజల కర్మవిముక్తి పథముపదేశించి - భయదుఃఖముల నెల్లఁబాఁపఁద్రోలు
విషమ ప్రశ్నలకెల్ల విఱుగుడులను జెప్పి - సందేహములఁ దీర్చజాలియుండు
స్వామి కేశవయ్య - శాంతుండు, దాంతుండు - భూత కరుణగల్గు పుణ్యశాలి;
సాయిభక్త వరుఁడు సజ్జన శ్రేష్ఠుండు - ముక్తికాముఁడతఁడు - మునివరుండు.
శ్రీ 'షినాయినగర' సీమలో, సాయి పూ - జా మందిరంబొండు, ప్రేమతోడ
వెలయించినారు; భక్తులు వేనవేలుగా - వచ్చుచున్నారు; సద్భక్తితోడ
సాయి పూజామహోత్సవములఁ బాల్గొను - చున్నారు; సాయి సంపన్న చరితఁ
గీర్తించుచున్నారు; మూర్తీభవించిన - స్వామియే- భక్త కేశవులు, పూర్వ
పుణ్య భాగ్యమున లభించె; పొందుగాఁగ - భారతంబున దక్షిణా పథమునందు
'సాయి' సందేశ హారుఁడై ప్రశస్తిఁగాంచె; - ♦ షిర్డిపురనాథు, నిందు యాశీస్సులంద
రందు రారందు ప్రజలార! నిండుతమిని.

♦ షిర్డి - షర్డి - నామాంతరములు.

# పుట్టబోయే శిశువులు

శ్రీమతి యం. లక్ష్మీదేవి



(ఒక గుఱ్ఱపుబండి ఒక ఇంటి గుమ్మం దగ్గిర ఆగుతుంది. బండిలోనుంచి జానకి తన ఎనిమిదేళ్ళకూతురు లతతోను, భర్త తోను, చంటిబిడ్డతోను దిగుతుంది. అందరు లోపలికి వెళ్ళుతారు.)

అమ్మ:—రా అమ్మాయి! జానకీ, రా అమ్మా లతా! రా. రండి అల్లుడుగారూ! రండి. రండి.

(అందరు వచ్చి కూర్చుంటారు)

అల్లుడు:—అసలు కాంతం భర్తకు ఏమైందండీ!

అమ్మ:—ఆఁ ఏమీలేదు. ఏదో నాలుగు రోజులు విడువకుండా జ్వరం వచ్చింది. అంతే, హఠాత్తుగ గుండె ఆగిపోయింది. ఇంకేం కావాలి?

అల్లు:—పాపం, అబ్బాయికి ఎన్నినెలలైంది?

అమ్మ:—వాడికి పదినెలలౌతుంది.

అల్లు:—ఏదోలెండి, భూమిమీద వాడి ఋణం అంతే! ఏంచేస్తాం, కాంతం మనస్సు దిటవుచేసుకోవాలి.

జానకి:—అల్లుడుపోయి సుమారు రెణ్ణెల్లవుతుందను కొంటాను అంతేనా?

అమ్మ:—అవును అంతే.

జానకి:—ఇందిర వచ్చిందా!

అమ్మ:—ఇంకా రాలేదు. భర్తకేమో ఒంట్లో బాగు లేదట. పోయినవారం ఉత్తరం వ్రాసింది. ఇవాళ, రేపో వస్తుందనుకొంటాను. దానికీ సెలవు దొరకాలా! నిల్చున్నపాటు ఉద్యోగాన్ని, జబ్బుపడ్డ భర్తను వదలిపెట్టి ఎట్లా రాగలదు?

జాన:—కాంతం ఉద్యోగం చూస్తుందా!

అమ్మ:—ఆఁ. చూస్తూనే ఉంది. అల్లుడి ప్రాణం పోతున్నదనగా ప్రమోషన్ కూడ అయింది.

జాన:—కాంతం వచ్చే వేళైందిగా!

అమ్మ:—ఇదుగో అన్నంతలో వచ్చేసింది. మళ్లా గుఱ్ఱంబండివచ్చి ఆగిందే, అదెవరూ!

అల్లు:—అదే - ఇందిరా! ఇప్పుడేనా రావడం?

ఇంది:—అవును బావయ్యగారూ! మీరందరూ వచ్చారా!

అల్లు:—ఇప్పుడే వచ్చాము.

కాం:—అక్కయ్యకూడ వచ్చిందా బావయ్య!

అల్లు:—ఆహా!

కాంత, ఇంది:—అక్కయ్యా.

జాన:—కాంతం! ఇందిరా! మేమూ ఇప్పుడే వచ్చాము.

ఇంది:—లతయేదీ! అమ్మా లతా! ఇలా రా!

లత:—ఏమి పిన్నీ.

ఇంది:—బాగున్నావా? ఏంచదువుతున్నావు?

లత:—ఏడవతరగతి చదువుతున్నాను పిన్నీ!

ఇం:—ఇప్పుడు ఉద్యోగం చూస్తున్నావా! లేదా! అక్కయ్యా!

జా:—చూస్తూనే ఉన్నాను. మరీ చంటిపిల్లవాడని ఆళ్ళెల్లు పెలవు పెట్టాను.

కాంత:—అమ్మా! ఒక శుభసమాచారం!

అమ్మ:—ఏమిటదీ?

కాంత:—మా మేనేజింగు డైరక్టరు ఇవాళ నా ద్వితీయ వివాహాన్ని గురించి ప్రస్తావించాడు.

ఇం:—ఎవరూ! చంద్రశేఖర్ బ్యానర్జీయా?

కాం:—అవును. అతడే. అబ్బాయినికూడ చూసుకొంటానన్నాడు.

లత:—కాంతం పిన్ని! మళ్ళా నువ్వు పెళ్ళిచేసుకొంటావా?

కాంత:—అవునే, నా బంగరు బొమ్మ!

జాన:—ఇందిరా, నీ భర్తకు జబ్బుచేసిందని ఉత్తరం వ్రాశావుటగా అమ్మకు! ఏం జబ్బు? మందిప్పిస్తున్నావా?

ఇం:—అసలు నా భర్త ఎవరూ? మందిప్పించడానికి, నేనప్పుడే విడాకులిచ్చేశాను. నా చేతగాదు ఆ జబ్బు మనిషిని భర్త అని చెప్పుకోటానికే సిగ్గవుతుంది.

అల్లు:—ఎన్నాళ్ళైంది విడాకులిచ్చి?

ఇం:—మొన్ననే, మొన్న సోమవారం జడ్జిమెంటు అయింది.

కాంత:—అయితే నువ్వూ వరాన్వేషణలో ఉన్నా వన్నమాట.

ఇం:—అవునే, అక్కయ్యా! మీ డిపార్టుమెంటులో జనరల్ అక్కౌంటెంటుగా ఉన్నాడే సుధాకర్ కులకర్ణి—

జాన:—అబ్బో! మంచియెత్తు వేశావే! అతని చుట్టూ చాలా వలలున్నాయి. ఏవలలో పడతాడో! మీ బావగారికి ప్రాణస్నేహితుడు.

ఇం:—అయితే ఇంకేం? నా వల్లోపడ్డట్టే!

లత:—అయితే ఇందిర పిన్నీ! నువ్వుగూడ మళ్ళా పెళ్ళిచేసుకొంటావా? అయితే మా చిన్నాయన భాస్కరం గతేంకానూ?

ఇం:—(కోపంతో) ఎవరే మీ చిన్నాయన? నేను మళ్ళా పెళ్ళిచేసుకొంటేనే చిన్నాయన.

లత:—అయితే నాకు చిన్నాయనే లేడా? ఒకచిన్నాయన చచ్చిపోయిలేడు. ఒక చిన్నాయన బ్రతికి ఉండీ లేడు.

జాన:—లతా! నీకేం తెలియదు. ఊరుకోవూ!

లతా:—ఏమిటమ్మా తెలియదంటావు? అనాది కాలం నుంచి భారత నారీమణులు పతియే దైవమని భావిస్తూ పూజిస్తూ వచ్చారుగదా! ఇప్పుడీ అవకతవక పిత్తలాటాలు ఏమిటి?

ఇంది:—ఆ కాలంలో స్త్రీలకు స్వతంత్రములేదు. బానిసబ్రతుకు బ్రతికారు. మగాళ్ళ అడుగులకు మడుగు లొత్తుచు కుంటిని, గ్రుడ్డిని, కురూపిని, దేవుళ్ళని మ్రొక్కుకుంటూ దున్నపోతులా ఇంటిచాకిరి అంతా చేస్తూ స్వతంత్రమైన జీవిత సౌభాగ్యాన్ని పోగొట్టుకున్నారు.

లత:—జీవిత సౌభాగ్యాన్ని పోగొట్టుకొన్నది వారుగాదు; మీరు జీవితంలో పతియే దైవమని నమ్మి పతివ్రతలై పరిమళించిన భారతరమణీ ప్రపంచంలో విప్లవాన్ని కలిగించి పడతికి పదుగురు మగలని పంచపాండవులనుగూడ తిరస్కరించిన మీబోటి మహిళామ తల్లులే జీవిత సౌరభాన్ని గోల్పోయిన వారు.

ఇంది:—సరేలతా! నీ పాయింటుకే వస్తాను. పంచపాండవులను పెళ్ళాడిన ద్రౌపది మాత్రం పతివ్రత అని ఎట్లా ఒప్పుకోగలవు?

లత:—అట్లా దొరికిరా పిన్నీ! పంచపాండవులను ద్రౌపది ఐదుగురన్నదమ్ములు, తల్లిగారి సమ్మతి వల్ల పెళ్ళాడింది. వాళ్ళైదుగురు ఐకమత్యంగాను

నీతి నియమాలకు కట్టుబడి ద్రౌపదిని గౌరవిస్తూ వచ్చారు. అందుచేత ఆమె ఐదుగురికి సేవా శుశ్రూషలు చేసి మహా పతివ్రత అనిపించుకొన్నది. కాని నువ్వు చేసుకోబోయే ఈ పెళ్ళి భాస్కరం చిన్నాయనకు సమ్మతమేనా?

ఇంది:—(అత్యుగ్రంగా) ఎవరు చెప్పారు నీకీ వెధవ కథలన్నీ?

లత:—నా కెవరూ చెప్పలేదు. మా నాన్నగారి లైబ్రరీలో పుస్తకం 'భారత నారీమణులు' దాన్లో చదివాను.

జాన:—లతా! ఊరుకో వూ—నీకేం తెలియదమ్మా!

లత:—తెలియకేం అమ్మా! దుర్బలుడు, కుష్ఠురోగి, వేశ్యాలోలుడు అయిన భర్తతో నాళాయిని మహా పాతివ్రత్యశక్తిని గడించలేదా! లోక రక్షకుడైన భాస్కరుని గతిని అడ్డుపెట్టి సర్వలోకాలకు సంక్షోభం కల్గించలేదా! ఇందిర పిన్నిలాగ భర్త జబ్బు మనిషి అని విడాకులిచ్చుకో లేదే!

కాంత:—లతా! ఆకాలం వేరు; ఈ కాలం వేరు.

లత:—ఏ కాలమైన ధర్మమొక్కటేగా! ఆ నాడు తూర్పున ఉదయించిన సూర్యుడే ఈ నాడు గూడ తూర్పున ఉదయిస్తున్నాడు. ఆ నాడు శుక్లపక్షమున వృద్ధిపొందిన చంద్రుడే ఈ నాడు శుక్లపక్షమున వృద్ధిపొంది కృష్ణ పక్షమున క్షీణించుచున్నాడు. ధర్మాచరణయందు ప్రకృతి మార లేదుగా! ఆ నాడు గూడ పుట్టినవారు చస్తూనే వచ్చారు, ఈ నాడు గూడ అంతేగా!

కాం:—ఆ నాటి మనుష్యుల అభిప్రాయాలు, ఆదర్శాలు వేరు; ఈ నాటి వారివి వేరు.

లత:—అయితే నువ్వు ఆనాటి అభిప్రాయాలు, ఆదర్శాలు నీచమైనవని భావిస్తున్నావా?

కాంత:—కాదుమరి — స్త్రీలను పాతివ్రత్యము అని మేకలను గొట్టి క్రూరంగ అణగగొట్టి హింసించడం ఉన్నత ఆదర్శాలా!

లత:—అయితే ఈ నాటి అభిప్రాయాలే ఉన్నతమైనవంటావా?

కాం:—అవును; ఆ కాలంలో భర్త జీవించి ఉంటేనే మహాపతివ్రత అని స్తుతించారు. కాని భర్తలు మరణించిన కౌసల్య, కుంతి, ఉత్తర, శశిరేఖ వీళ్ళనుగురించి ఏమన్నా అన్నారా?

లత:—వీళ్ళు భర్త మరణించిన పిమ్మట సన్యాసినులై జీవించారే గాని నీలాగ మళ్ళా పెళ్ళి చేసుకొంటామనలేదే! ఇప్పుడు నువ్వు పెళ్ళి చేసుకొంటె మళ్ళా నీకొక కొడుకు పుట్టితే ఇప్పుడున్న కొడుకు పుట్టబోయే కొడుకు అన్నదమ్ములెట్లా అవుతారు? ఒకడు అమ్మకొడుకు. ఒకడు అబ్బకొడుకు అని అనిపించుకొంటాడు. దీంతో సమస్త మానవ జాతికి ద్వేష, వైషమ్య భావాలు, నానాటికి పెరిగి అహంకారోద్రేకంలో ప్రపంచం భస్మమై పోతుంది. దీనికంతటికి ఎవరు కారణం? గృహలక్ష్మి, ధర్మపత్ని అని ప్రపంచంలో ప్రణుతికెక్కిన, పదాన్నలుగులో కాలం తలయొగ్గి నమస్కారాలను పొందిన, 'లోకమాత' అనిపించుకొన్న నారీత్వమేకదా!

జా:—(ఆశ్చర్యంతో భర్తవేపు చూచి) ఇదేమిటండీ! లత ఇలా అంటూంది?

అల్లు:—అనడానికేముందీ? యుగ యుగాల నుండీ! రక్తంలో రక్తంగా ఆత్మలో ఆత్మగా జీర్ణించి పోయిన భారత నారీమణుల ధర్మం లతనలా పలికిస్తోంది. భావిభారతీయ నారీమణులు సాధ్వీ శిరోమణులు. ఇకమీ కాలం ఈ గుడ్డి స్వాతంత్ర్య సంపాదనలో పడి కుళ్ళి పోవలసిందే!



# శతాబ్దం క్రిందట

"శార్వాణి"

"నీ చేతికి ఎన్ని వ్రేళ్లున్నాయి ?"

"లెక్కపెట్టి చెప్తాను ?"

"పోనీ, నీ కెన్ని తలలున్నాయో చెప్ప గలవా ?"

"అద్దంలో చూస్తేగాని తెలీదు."

"నిన్ను రేపు ప్రజలు మహా మంత్రిని చేయబోతున్నారు."

"బలే బాగుంది. వాళ్లు మంచిపని చేస్తున్నారు"

"ఈ రాజ్యాన్ని పరిపాలించాలని నీ కిష్టంగావుందా ?"

"సింహాసనం ఎక్కుతానంటే, కొండ మీదవున్న కోతికూడ పరుగెత్తుకొని వస్తుంది."

"మా దేశంలో కోతులు పరిపా లించవు."

"కోతుల్లాంటి మనుష్యులు పరిపా లిస్తారా ?"

"నీకు మహా మంత్రిపదవి యివ్వడం నా కిష్టంలేదు ?"

"ఎందుకని ? నేను మనిషినిలాగ కన్పిం చడంలేదూ !"

"ఇంతకముందు ఎప్పుడైనా రాజ్యం యేలేవా ?"

"నేనొకప్పుడు మహా రాజుని."

"ఏ దేశంలో..."

"మా పెద్ద భవనంలో."

"ప్రజ లెవరు ?"

"బొమ్మలు; వాటికి ప్రాణాలుండవు. 'కీ' యిస్తే వాటి పనులు అవి చేస్తాయి."

"నీ బొమ్మలు-కాదు నీప్రజలు భోజనం చేస్తారా ?"

"వాటికి ఆకలిదప్పులుండవు. పుట్టుక తోనే అవి ఆకలిని మరచిపోయాయి."

"రేపు నిన్ను ఏకగ్రీవంగా ఎన్నుకునే ప్రజలు అన్నం తింటారా ?"

"కొంతమంది ఒక చేతితో తింటారు. మరికొంతమంది రెండు చేతులతో తింటారు."

"నన్ను మహా మంత్రిగా ఎన్నుకునేది రెండు చేతులతో తినేవాళ్లనుకుంటాను."

"పుష్టిగా ఆరగిస్తారు కాబట్టి, నేనంటే వాళ్లకు అభిమానం."

"రేపు మహా మంత్రి అయితే మంచి పనులు ఏమిచేస్తావు ?"

"ఈ ఊరు బాగుండలేదు. రాజధాని వెంటనే మారుస్తాను."

"ఎక్కడకు మారుస్తావు ?"

"జనసంచారంలేని స్థలానికి."

"శూన్యాన్ని పరిపాలించడానికా ?"

"శూన్యంలో మనుష్యులను సృష్టించడానికి నా బుర్ర యిప్పుడు బ్రహ్మాండంగా పనిచేస్తుందికదూ ?"

"దేశంలో ఒకవైపు ధనికుల ఆరాచకాలు పెచ్చుపెరిగి పోతుంటే చూస్తూ వూరుకుంటావా ?"

"వాళ్లందర్ని నా సలహాదారులుగా తీసుకుంటాను. ఎందుకంటే కోశాగారం పెరుగుతుంది."

"అయితే మరి పేదవాళ్లసంగతి ఏం చేస్తావు ?"

"వాళ్లకు తెలివితేటలులేవు. ధనార్జనచేయడం చేతకాదు. వాళ్లకు ఒక పాఠశాల నిర్మిస్తాను. డబ్బును గడించే విధానం ఆ బడిలో నేర్పుతారు. వాళ్లు చదువుకున్న తర్వాత గొప్పవాళ్లవుతారు. ఈ పథకం ఎల్లావుంది?"

"డబ్బు గడించడం నేర్చుకుంటేరాదు, కచేరీలో పనిచేసేవాళ్ళకు జీతాలు తగ్గించకూడదు."

"ఆర్థికపరిస్థితులు ప్రతికూలంగా వున్నప్పుడు ప్రజలు సహాకరించాలి. ఇచ్చిన ప్రతిఫలంతోనే సంతృప్తిపడాలి. అప్పుడే 'సహాకారం' ఏర్పడేది."

"చాలీచాలని జీతం, తన జీవితానికి, తనతోబాటు బ్రతుకుతున్నవాళ్లకి ఎల్లా సరిపోతుంది ?"

"పొదుపుగా వాడుకోవడం నేర్చుకోవాలి ?"

"అంటే మీ ఉద్దేశ్యం ఒక పూట పస్తులుపడమనా ?"

"నా దేశంలో ఎవరూ ఆకలితో బాధపడకూడదు. అల్లాగ జరిగిననాడు వూరు వెలుపల ఒక సానుభూతిసభ ఏర్పాటుచేసి, ప్రజలను సంతోషపరచడం మా విధి."

"రోమ్ తగలబడిపోతుంటే సీజర్ వైలన్‌తో సంగీతం పాడినట్లుంటుంది."

"ఆవిధంగా జరిగింది కాబట్టి, సీజర్ పేరు తలచుకుంటున్నాము."

"మీకెన్ని బుర్రలున్నాయి."

"అది ప్రజలే నిర్ణయించాలి"

"కొంతమందికి మీరు మహామంత్రి అవడం ఎంత మాత్రం యిష్టంలేదు."

"వాళ్ళకు యిష్టంలేనంత మాత్రంతో నేను మహా మంత్రిని కాకుండా మానను."

"కొంతకాలంపోయిన తర్వాత ప్రజలు ఎదురుతిరుగుతారు."

"అప్పుడు ఇతర దేశం రాజులు సహాయం చేస్తారు."

"దేశంలో ప్రస్తుతం, నల్లబజారు, లంచగొండితనం, వ్యభిచారం యిత్యాది అవినీతులు తాండవిస్తున్నాయి. వాటిని రూపుమాపాలి."

"కొంతకాలం వాటిని శ్రద్ధగా పరిశీలించి, ఒక నిర్దుష్టమైన పథకం తయారు చేయాలి. మొట్టమొదట వాటి జన్మస్థానాలను కనుక్కోవాలి."

"మీరెంతవరకు చదివారు."

"నా చదువుకి నా ఉద్యోగానికి సంబంధంలేదు. మీరు అడుగుతున్నారు కాబట్టి చెప్తున్నా. పొట్టి సంతకం, పొడుగు సంతకం రాజభాషలో పెట్టగలను."

"ఈ విషయం నిన్ను కోరే ప్రజలకు తెలుసా?"

"తెలుస్తే మాత్రం మానతారా? నా దగ్గర కావలసినంత డబ్బుంది. ప్రాణాలను కొనుక్కునే తాహతు నాధనానికి వుంది."

"ఇప్పుడు అర్థమయింది."

"ఏమిటి?"

"నీ చేతికి ఎన్ని వ్రేళ్ళున్నాయో, నీ వింక చెప్పనవసరంలేదు."

"నా కిప్పుడు తెలిసింది."

"ఏమిటి?"

"నా చేతికి ఏడు వ్రేళ్ళున్నాయని."

"నాకు ఐదే కన్పిస్తున్నాయి."

"నీ కంటికి ఐదే కన్పిస్తాయి."

"నీ కెన్ని తలలున్నాయి."

"రెండు. అందులో ఒకటి పని చేయదు."

"అయితే నీవు మహా మంత్రి పదవికి అనర్హుడివి".

"రెండోది పని చేస్తుందిగా?"

"ఏ దేశంలోను యింతవరకు రెండు తలలున్నవారు పరిపాలించలేదు."

"ఇప్పుడు, ఇహముందు పరిపాలిస్తారు."

"అప్పుడు రెండు చేతులతోబాటు మరొక రెండు చేతులు వస్తాయి."

# మేలుకొలుపు

'పల్లపోతు'

అది సాయం సమయం భానుడు తన వేటను చాలించి, ఒక్కొక్క అంబుగా దీసి తన పొదిలో దాచుకుంటున్నాడు. ప్రకృతి కాంతను విడిపోవుట ఇష్టంలేనట్లుగా సంధ్యాచీకట్లు ఇచ్చే ఆహ్వానాలను అయిష్టంతో స్వీకరిస్తున్నాడు. అప్పుడప్పుడే విహారములు చాలించి గూటికి చేరుకుంటున్న పక్షులకిలకిలా రావములూ, షికార్లు చాలించి కొంపలకు చేరుకుంటున్న కారుల శబ్దములు తప్ప మరేమీ వినిపించటం లేదు. తమ శత్రువు వెళ్ళైదన్న ఆనందాశయంలో ఉప్పొంగి పొదలచాటునుండి వస్తున్న చీకటి ప్రకృతి ఆవరిస్తూ, తూర్పుదిశనుండీ వీచేచల్లని పిల్ల వాయువులు ఇచ్చే ఆహ్వానాలను ఆశదీరా అందుకుంటూ, చేరువనున్న పార్కుపై దాడిచేసింది ... అప్పటికే ఆ ఫార్కులోని అన్ని బెంచీలు ఖాళీ అయినవి. ఎందుచేతనో ఆమూల బెంచీని ఆక్రమించిన 'నవనీతం' అలాగే కూర్చొనివుంది. ఒంటరిగానున్న ఆమెహృదయం ఆలోచన వీణా తంతులను మీటుతుంది.

◆ ◆ ◆

అవి నవనీతం స్కూలు ఫైనల్ చదువుతున్న రోజులు. ఆవిడ వేసే దుస్తులూ, చేసే ఆడంబరాన్ని బట్టి చూస్తే గొప్పకుటుంబీకురాలుగా కన్పిస్తుంది. నిజంచెప్పాలంటే ఒకసామాన్య కుటుంబంలో జన్మించినట్లుగా చెప్పటానికి అవకాశాలులేవు. కేవలం ఒక బడిపంతులు కూతురంటే అందరికీ ఆశ్చర్యం వేస్తుంది. ఆవిడచేసే ఆడంబరాలకు 'ఫొటోగ్రాఫర్ శ్యామ్' కారకుడని కొందరి ప్రచారం. ఏది ఏలా వున్నా, విశాలమైన ముఖానికి తీర్చిదిద్దిన స్నో, పౌడరూ, కాటుకబెట్టిన చారడేసి నేత్రాలూ, స్టైల్‌గా అల్లబడిన నొక్కుల జుట్టూ, నవనాగరీకంగా ధరించబడిన దుస్తులతో, ఎరుపురంగుగాక చామన చాయగా 'దేవకన్య'లా కన్పించే ఆమెతో సాంగత్యాన్ని పొందగల్గిన శ్యాము నిజంగా అదృష్టవంతుడే!

ఆనాడు సోమవారం. గతదినమంతా గదిలో జరిపిన ఏకాంతానికి స్వస్తి-ఉదయం 9 గంటలకే స్కూలుకు చేరుకుంది. స్కూలంతా నిశ్శబ్దమయం. ఒంటరిగావున్న ఆమె హృదయం ఏదో మధురస్మృతులను మీట నారంభించింది. మనస్సు వాంఛలను రేకెత్తించింది. హృదయం ఆశా సముద్రంలో అల్లల్లాడ నారంభించింది. ఏకాంత జీవితంలో ఉక్కిరి బిక్కిరి అవుతున్న ఆమె హృదయం ఏదో మధుర భావాలపై స్వారిచేయనారంభించింది......ఇంతలో హఠాత్తుగా ఎవరిదో ఒక సుకుమారపు హస్తం ఆమె బుజంపైవాలింది. బాధగా, బరువుగా తన దృష్టిని వెనుకకు మరల్చింది. తన స్నేహితురాలు 'కమల' నవ్వుతూ నిలబడింది. ఏదో ఆమె చెవులో రహస్యంగా చెప్పి, గట్టిగా వీపుపై చరిచింది. ఆమెలో వెర్రి ఆనందం పరవళ్ళుత్రొక్కింది. మొరటుగా తారురోడ్లపై బడింది. చిన్నా, పెద్దా, గురువూ, దైవం, అనే విచక్షణలేకుండా పట్టపగలు శ్యాం రూముకు చేరుకుంది. తనకొఱకు ఎదురుతెన్నులు బడుతున్న శ్యాం ఆమెను తన బాహుబంధాలలో రబ్బరు బొమ్మగా చేశాడు. ... ... అంతే! ... అలా ఎంతకాలం గడిచిందో; కళ్ళు తెరచి చూసింది. ముఖాన స్నో, పౌడరు చెదిరిపోయింది. బట్టలు పూర్తిగా నలిగిపోయాయి. నీరసంగాపైకి లేచింది. వికృతంగా నవ్వుతున్న శ్యామ్ ఆమెకళ్ళకు రాక్ష

నుడిలా కన్పించాడు. ఆ నవ్వులో ఏవో శూలాలు ఇమిడి వున్నయ్! అవి ఆమె హృదయాన్ని బాధ పెట్టినై. అతని మొఖం చూడలేక రెండు చేతులతో మొఖాన్ని కప్పుకుంది... ఇప్పుడు తనేం చెయ్యాలి! ...శీలభ్రష్ట! శీలమే లేకపోతే సంఘంలో స్థానమే లేదే! కామకక్కుర్తికి కళ్ళు మూసుకుని కాని పని చేసింది. కర్తవ్యమేమిటి?

"నవా!" అన్నాడు మృదువుగా శిరస్సు నిమురుతూ; అమాయకంగా అతని కళ్ళల్లోకి చూచింది. 'భయపడుతున్నావా? ఇదుగో చూడు ... నీ ఫోటోలు నాలుగు స్టూడియోకి పంపాను. మన అదృష్టంకలసివచ్చి, 'రమ్మని' లెటరు వ్రాశారు. ఇదుగో చూడు! నీకు అభ్యంతరంలేకపోతే, వెళ్దాము అంటూ ఒక కవరు ఆమె చేతికిచ్చాడు. ఆత్రంగా దాన్ని విప్పి చదివింది. తన హృదయానికి హత్తుకుంది. వెర్రిగా అతన్ని నమ్మింది. తనొక పెద్ద సినిమా యాక్టరునౌతానని ఉప్పొంగింది. తన పేరు వాడ, వాడలా మారుమ్రోగుతుందని సంబరపడింది. తన జన్మ తరించిందని భావించింది. తన కోరికలు నెరవేరాయని సంతోషపడింది. తల్లీ తండ్రి, ఇతర ఆప్త బంధువుల్ని వదలి అతనితో వెళ్ళిపోయింది.

ఒకనాడు ఒక బట్టతల మనిషితో ప్రత్యక్షమయ్యాడు శ్యాము. 'ఇతనొక ఫిలిం నిర్మాత ఇతన్ని పట్టుకుంటే సినిమాలో నటించవచ్చు' అని ఆమెను ఒప్పించి, ఆ సుందర కోమలాంగిని ఆ బట్టతలవానికి స్వాధీనంచేశాడు. నవనీతం మొఖం తెర ఎక్కింది. కానీ, చిల్లర వేషాలతో. ఆమె తృప్తిబడలేదు. ... వేరొకనాడు ఒక సూటువాలాతో దర్శనమిచ్చాడు. 'ఇతను డైరెక్టర్! ఇతన్ని వలలో వేసుకుంటే, తారాపథం అందుకోవచ్చు' అని ఆ రాత్రి ఆమెను సూటువాలాకు అప్పగించాడు. శ్యాం చేస్తున్న వ్యాపారం నవనీతానికి బోధపడింది.

◆ ◆ ◆

టంగ్, టంగ్ మని క్లాక్ టవరు గొట్టిన పన్నెండు గంటలు నిశ్శబ్దాన్ని చీల్చుకొని ఆమె చెవిననాటినై. దూరమున కన్పిస్తు టాక్సీ సింహగర్జన నవనీతం ఆలోచనా నదికి ఆనకట్టయింది. కళ్లు తెరచిచూచింది. ప్రపంచమంతా నిద్రాదేవి కౌగిటిలో కలసిపోయిందనిగానీ, ప్రకృతి అంతా నిశ్శబ్ధమైనదనిగాని ఆమెకు తెలియదు.

ఆమె మనస్సులో మెరపుతీగలా ఒక ఆలోచన తోచింది. సంతోషంతో పైకిలేచింది. అడుగు ముందుకు వేసింది 'ఆగు! ఏమిటా సాహసం! చచ్చి సాధించేదేముంది; పిచ్చిదానా! భవిష్యత్తును గుర్తించక, పిచ్చిభ్రమల్లోపడి, నీ చేతులతో నీ జీవితాన్ని నాశనంచేసుకున్నావు. అర్థంలేని ఆశలకుపోయి అగాధంలోకి కుంచుకపోయావు. ఆదర్శంగా జీవించాల్సినదానివి అధోగతిపాలయ్యావు. నీ జీవితంలో నీవు చేసిన పొరపాటుకు తగిన శిక్ష అనుభవించావు. పాపాలకు పశ్చాత్తాపమే పరిహారం. ఇప్పటికైన కళ్ళు తెరిచావు. నీచమైన ఈ వృత్తికి స్వస్తిచెప్పు! చదువుకున్నావు; దాన్ని సద్వినియోగంచేయి! వెళ్ళు; పో!'

నవనీతం వెనుకకు తిరిగింది. అంతే! ఆనాటి నుండి, ఏమయిందీ ఎవరికీ తెలియదు. ఎవరికి కన్పించలేదు. కన్పించదు. కన్పించాల్సిన అవసరంగూడా లేదు.



# వాళ్ళనలా వదిలేద్దాం

శ్రీ నేమాని సంగమేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

3

దమయంతి జీవితంలో ప్రభాకరుని పరిచయం ఎలా పనిచేసిందో, ప్రభాకరుని జీవితంలో దమయంతి సందర్శనం అలాగే పనిచేసింది!

ప్రభాకరునికీ దమయంతికీ మనస్తత్వంలోనూ, ఊహలు ఉద్దేశాలలోనూ చాల తేడావుంది!

ఎప్పుడూ ఆడంబరముగా, డాబుగా లోకములో విహరించే విలాసజీవి ప్రభాకరుడు. స్నేహితులచేత మెప్పులు పడుతూ వారిని మెచ్చుకుంటూ ఎప్పుడూ ఏదో ఆనందముతోగాని ఆసక్తితోగాని జీవితం గడుపుతూ వుంటాడు.

అసలు తుమ్మెదవంటి మనస్తత్వం కలవాడు ప్రభాకరుడు. "అందం ఎందుకు పుట్టింది – అంటే అనుభవించడానికి! నూతనత్వం లేనిదీ జీవితంలో హాయిలేదు!"– అని నిర్వచనాలు చెపుతూ వాటిని అక్షరాలా ఆచరణలో పెట్టే విపరీత స్వభావుడు!

పచ్చకామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగా కనిపించినట్లు ప్రపంచములో వుండే విలాసాలు, విహారాలు తప్పించి ఇంకేమీ కనిపించవ్! చూడడు! ఇంకే తలంపులు వచ్చినా బలవంతంగా వాటిని బయటకు నెట్టేస్తాడు!

అతి చంచలమయిన స్వభావంతో ఏ నిర్ణయానికి రాలేక, సమయానుకూలంగా మార్పు చేసుకుంటూ వుంటాడు ప్రభాకరుడు. అతడు దేన్నిగురించి ఆలోచించడు. ఆలోచన అన్నపదం అతని జీవితంలో లేనే లేదు. ఏదో ఒకటి చేసివేస్తాడు.

దమయంతి ఏమి చూసుకొని ప్రభాకరాన్ని తన మనోవీధులో తనప్రక్క నిలబెట్టుకుందో!

చటుక్కున ఒక నిర్ణయానికి రాలేని దమయంతి కూడా ఆవాళ ఒక నిర్ణయానికి వచ్చేననుకుంది! తనలోవున్న లోపం తనకి తెలిసినట్టు భావించింది కాని తెలుసుకోలేకపోయింది!

తూర్పు పడమరలు ఏకం అవవు! ఈ సంగతి 19 ఏళ్ల దమయంతికే కాదు ఆరు సంవత్సరాల బాలుడు కూడా ఘంటాపదంగా చెప్పగలడు.

అయితే తూర్పు అంటే ఏమిటి? పడమర అంటే ఏమిటి? ఎందుకు కలియవు? ఈ

సంగతి మొదట తెలుసుకుంటేగాని ఎందుకు కలియవో తెలియవు!

అల్లాగే ఏ సంగతి సరిగ్గా నిర్ణయించుకోకుండా ప్రభాకరం జీవితంలో తను కలిసి పోగలను అనే ధీమా ఒకటి కలిగింది దమయంతికి.

మానవుల్లో దేవతలు, మానవులు, దానవులు వున్నారు! అయితే ఈ సంగతి మాత్రం అట్టే ప్రపంచ జ్ఞానములేని దమయంతి మాత్రం వూహించలేకపోయింది.

పైకి చూడడానికి బాగుండగానే లోపల మనస్సు, అంతఃకరణ స్వచ్ఛముగా వుంటుందనుకోవడం పొరబాటు. ఈ పొరబాటే దమయంతీ సహజంగా చేసింది.

ఇంతకీ పెళ్ళి వగైరాలు కాలేదు. అవవచ్చు! అవకపోవచ్చు! రాబోయే ఆపద గూర్చి విచారించేవాళ్లు మూర్ఖులు. ఈ విషయం ఆలోచిస్తూ దమయంతి తెలివి తక్కువగా ప్రవర్తించి బేలఅయిందని చెప్పక తప్పదు.

దమయంతిని మానసిక వ్యధలు క్రుంగదీస్తూవుంటే ప్రభాకరరావును వాతావరణ ప్రభావం లేవదీస్తున్నాది.

అంతకు ముందే ఎంతోమందిని ఎంచి, అనుభవించి, పిప్పిని పారేసినట్టు పారేసిన ప్రభాకరరావు దమయంతిని చూడగానే ఆవిధంగా ఆమెను తలపెట్టడం మాని తన జీవితంలో భాగస్వామిని చేసుకుందామని అనుకోవడం నిజంగా ప్రభాకరరావులో ఒక పెద్ద మార్పేఅని చెప్పవచ్చు?

అయితే ఈమెను వివాహం చేసికోవాలనే వాంఛ ప్రభాకరరావులో మామూలుగానే కలిగింది.

అది నెఱవేరవచ్చు! నెఱవేరకపోవచ్చు! నెఱవేరితే ఆలస్యమవవచ్చు! అందుచేత అప్పుడు చూసుకోవచ్చు అని ఆ వుద్దేశాలు అక్కడతో తుంచి "ప్రస్తుతం" ఆలోచించుకుంటూ నడవ సాగేడు,—ప్రభాకరరావు దమయంతి యింట్లోంచి బయటకు రాగానే!

క్రిష్ణాకేఫ్‌లో దూరిన ప్రభాకరరావు వాచీ 8½ గంటలు చూపడం గమనించేడు.

రెండు మెతుకులు నోట్లోవేసుకొని సిగిరెట్ ముట్టించి మెల్లిగా వసుందర ఇంటికి దారి తీసేడు!

ఉన్నతమయిన చదువు, సంస్కారము వున్నాయి ప్రభాకరరావులో. అలా అని నీచ భావాలు లేకపోలేదు; స్థిరత్వములేని వుత్తమ నీచభావాలు రెండూ మిళితమై వున్నాయి ప్రభాకరరావులో! దేనికయినా ఇట్టే దాసుడు అయిపోగలడు!

తలుపు తట్టేడు. ఇరువది ఐదేళ్ల వయస్సులోవున్నప్పటికీ కృత్రిమ అలంకరణతో 19 ఏళ్లవయసు కత్తెలాగ అగుపించే

వసుంధర తలుపు తీసింది. "Good Night Darling"! అంటూ ఆమె గడ్డం తన చేతితో తాకి మంచంమీద వాలేడు కోటుబూటు విప్పకుండానే.

"నమస్కారం! ఎప్పుడొచ్చేరు మద్రాసునుండి?"

"ఎప్పుడోనా! ఇవాళ ప్రొద్దుటే! ఈ వూళ్లో వుంటే నిన్ను కలియకుండ వుండగలనా—?"

"ఆమాటల కేమిలెండి! ఇన్నాళ్లబట్టి నేను జ్ఞాపకమొచ్చెనా? మద్రాసునుండి నాకు ఒక్క ఉత్తరమయినా రాశారా?" అంది ప్రేమ ఒలకపోస్తూ వయ్యారంగా.

"అదే చెబుదామనుకుంటున్నాను. పిచ్చిదానా! మద్రాసులో నేను గడ్డి కోస్తున్నాననుకున్నావా?"

"అని నేననలేదే!" అంది హుషారుగా.

"నువ్వు బయటకు అనలేదనుకో! కాని నీ మనస్సులో వుంది కదూ!" అన్నాడు. ఏదో తెలియని గొప్ప విషయం తెలుసుకున్నట్లు "నా మనస్సులో ఏముందో తెలుసుకునే పరిజ్ఞానం మీకున్నట్లు మాట్లాడుతున్నారే! కాని నా మనస్సులో అది లేదు" అంది.

"అయితే నీ మనస్సులో యేమిటి వుంది?"

"మీరు చదువు పేరు చెప్పి మద్రాసులో వుంటూ సీతాకోక చిలుకల్ని వెంటాడుతున్నారు కదూ! అవునా?"

కాంతిలేని కళ్లు నీరసంగా ప్రకాశింప జేస్తూ అంది.

"చంపేశావ్! అసలు నాకు వీటికి తీరిక ఎక్కడ?— నేను చదివిన దేమిటో నీకు తెలుసా? M.B.B.S.—"! అన్నాడు కొంచెం గొప్పగా "M.B.B.S. అయితే ఏం పోయింది? అయినా మీరు చదివింది. ఆ చదువుగాని ఈ చదువు కాదుగా"!

సిగిరెట్ పొగ "రింగ్స్"గా వదులుతూ "వసూ! ఎంత అందంగా కనబడుతున్నావ్ యివాళ! ఎందుకంత దూరంగా నిలబడతావ్? రా! కూర్చో!"

"మీరు లేచి కోటూబూటు యిప్పండి" అంటూ చెయ్యి అందిచ్చింది.

"తేంక్యూ" అంటూ లేచి కోటు విప్పి ఆమెకు యిచ్చేడు.

జేబుల బరువుపసిగడుతూ ఒయ్యారంగా తీసికెళ్లి దానిని వంకీకి తగిల్చివచ్చింది. జోడువిప్పి ఒకమూల పారేసి మంచంమీద వాలేడు ప్రభాకరరావు.

"ఏదీ వసూ! ఒక కిళ్లీ అందుకో!" అన్నాడు. వసుంధర బయటకు వెళ్లి ఆకులు, వక్కలు, సిగిరెట్ప్యాకెట్, గ్లాస్కులో

కాఫీ తెప్పించింది. ఆకులు నములుతూ వసుంధరను లాక్కున్నాడు; దీపం తగ్గించి వచ్చింది వసుంధర.

ఉదయం సూర్యకాంతి జాఫ్రీలోంచి ముఖంమీద పడగానే తెలివి వచ్చింది ప్రభాకరానికి. వసుంధర అంతకు ముందే లేచింది కాబోలు అక్కడలేదు. వాచీ చూసుకునేసరికి ఏడుంపావు అయింది. ఆదరా బాదరాగా లేచి కోటు జేబీలోవున్న దువ్వెన్న తీసేడు. తల ఒకసారి మీదికీ ఎగదువ్వి ఒకసారి రుమాలుతో గట్టిగా ముఖం తుడిచేడు. కోటు వేసుకొని జేబులు చూచుకున్నాడు. జేబు బరువు తగ్గింది! జేబులో చెయ్యిపెట్టి పర్సుతీసి చూసేడు. ఒక రూపాయి కాగితం కొంత చిల్లరవుంది! నవ్వుకొన్నాడు. పర్సు బటను తగిలించి జేబులో పెట్టేడు.

(సశేషము)

# అమెరికాలో స్త్రీలకు ఉద్యోగాలు

## (సాధికార వివరాలు)

ఎలిస్ కె. లియొపాల్డ్



ఇరవయ్యో శతాబ్దపు బలమైన శక్తులు అమెరికాలో స్త్రీలు అధిక సంఖ్యాకంగా ఉద్యోగాలలో చేరటానికి కారణమైనవి. ఈ శక్తులలో రెండు ప్రపంచ యుద్ధాలు, జనాభా శీఘ్రాభివృద్ధి, జనాభాలో స్త్రీల సంఖ్య పురుషుల సంఖ్యకంటె అధికం కావటం మొదలైనవాటిని పేర్కొనవచ్చు. ప్రస్తుతం 14 సంవత్సరాలు ఆపైన వయస్సుగల జనాభాలో మగవారికంటే మహిళ సంఖ్య 2,000,000 అధికంగా ఉన్నది.

గణనీయమైన సాంకేతికాభివృద్ధి, వ్యాపార పద్ధతులలో వచ్చిన మార్పులు, సాంఘిక ఆచారాలలో వచ్చిన పరిణామాలవల్ల పాత, కొత్త ప్రత్యేక తరహాల పనులలో ఆడవారి అవసరం పెరిగింది. మగువలను ఈ పనులకు పనికివచ్చేట్టు శిక్షణ గరిపేటందుకై వారికి నూతన శిక్షణ సంస్థలు ఏర్పాటు చేయటం జరిగింది. ఈనాడు స్త్రీలు దాదాపు అన్ని వృత్తులలోనూ పనిచేస్తున్నట్టు జనాభా లెక్కల వివరాలనుబట్టి తెలుస్తున్నది.

ఇదే సమయంలో అధిక తరమైన సౌఖ్యదాయకమైన నివాస గృహాలు పరిపాటి అయిపోయినవి. కొత్త కొత్త యంత్రాలు కనుగొనటంవల్ల భారీఎత్తున రెడీమేడ్ దుస్తులు తదితర గృహోపకరణాల ఉత్పత్తి సాధ్యమైంది. వంటకాలు తయారుచేయటంలోనో వాటిని నిల్వచేయటంలోనో వచ్చిన నూతన విధానాలవల్ల పక్వాహారాలు, దాదాపు తినటానికి వీలుగా ఉండే అయిన ఆహారాలు మార్కెట్లలో లభ్యమవుతున్నవి. ఇలాంటి నూతన శ్రమ తగ్గించే సాధనాలవల్ల స్త్రీలు వంట ఇంట్లో కాలం వ్యర్థ పుచ్చవలసిన అవసరం తగ్గిపోయింది.

### ఉద్యోగాలలోగల స్త్రీల సంఖ్య

పూర్తికాలంచేసే పనులలో 1955 సంవత్సరపు లెక్కల ప్రకారం 20,000,000 మంది స్త్రీలు అమెరికాలో నియుక్తలై ఉన్నారు. మొత్తం దేశంగల 14 సంవత్సరాలపైబడ్డ స్త్రీ జనాభాలో ఈ సంఖ్య మూడోవంతుకు పైగా ఉన్నది. మొత్తం దేశంలో పనిచేసేవారి సంఖ్యలోకూడా ఇది మూడోవంతు దాకా ఉన్నది. 1955 లో ఒక సమయంలో అయితే దాదాపు 28,000,000 స్త్రీలు ఉద్యోగాలలో ఉన్నారు. ఇందులో 10.000,000, 11,000.000 మధ్య సంవత్సరం పొడుగునా పనిచేసేవారు. మిగతా వారు కొన్నాళ్ళు పనిలో కొన్నాళ్లు బయట ఉంటుంటారు. వేసంగి సెలవుల సందర్భంలో ఉద్యోగాలు చేసే విద్యార్థినులు, పని ఒత్తిడి కాలంలోనో కోత నాతల తరుణంలోను మాత్రమే తాత్కాలికంగా పని చేసే ఆడవారు, సంవత్సరంలో కొంత కాలంపాటు మాత్రమే పనుల్లో ఉండగోరే గృహిణులుకూడా ఈ మిగతా సంఖ్యలో చేరి ఉంటారు. దేశంలోగల స్త్రీ జనాభాలో వయోజనులైన వారిలో సగానికి పైగా మంది జీవితం ఎప్పుడో కొంతకాలం బయట ఉద్యోగాలు చేసినవారే ఉంటారు.

### వయసులు

ఈ శతాబ్దారంభంలో ఉద్యోగాలుచేసే స్త్రీల

సగటువయసు 26 సంవత్సరాలు ఉండేవి. కాని అప్పటినుంచి ఇది పెరుగుతున్నది. 1940 లో ప్రభుత్వ పాఠశాలలలో చేరే విద్యార్థుల సంఖ్య పెరగటం, బాల కార్మికుల వయోపరిమితిని హెచ్చిస్తూ కార్మిక చట్టాలలో మార్పులు జరగటం వంటి పెద్ద మార్పుల ఫలితంగా ఈ సగటు వయసు 32 సంవత్సరాలవరకు పెరిగింది.

రెండో ప్రపంచ యుద్ధకాలంలో 30, 40 సంవత్సరాలప్రాయపు స్త్రీలు ఎక్కువగా పనులలో చేరారు. యుద్ధానంతరం ఆరికరంగ విస్తరణవారందరూ పనులలోనే ఉండిపోయేట్లు ప్రోత్సాహకారణమవటమే గాక ఇంకా కొత్తగా పెద్ద వయసు స్త్రీలుకూడా పనుల్లో చేరేట్లు ఆకర్షించింది. 1956 ఏప్రిల్ నాటికి స్త్రీ కార్మికుల సగటు వయసు 395 సంవత్సరాల వరకు పెరిగిపోయింది. సెకండరీ స్కూళ్ళలో చదువుకోవలసిన వయసులో ఉన్న ఆడపిల్లల బయట పనులలో చేరటం బహు అరుదు. 18-24 సంవత్సరాల మధ్య ప్రాయంలోగల యువతులు బ్రహ్మచారిణులుగాని, గృహిణులుగాను సాధారణంగా ఎక్కువగా ఉద్యోగాలలో చేరగోరుతుంటారు. ఆ తరువాత వర్గం 25-34 మధ్య వయస్సుగల స్త్రీలు. వీరిలో ఇంటిపనులభారం జాస్తిగా ఉండేవారు అధికంగా ఉంటారు. అందుచేత ఈ వయసులోనివారు ఉద్యోగాలలో చాల తక్కువ సంఖ్యలో ఉంటారు.

ఇక 35-54 సంవత్సరాల మధ్యవయస్సుగలవారు కూడా ఎక్కువగా పనుల్లో చేరతారు. వీరి సంఖ్య కూడా 18-24 మధ్య వారితో దాదాపు సరిసమానంగానే ఉంటూ ఉంటుంది. పిల్లలు బడికిపోయే ఈడు రావటమో, పెద్దవాళ్లయిపోవటమో జరిగిన తరువాత మళ్లీ తల్లులు పనుల్లో చేరగోరతారు. అందువల్లనే వీరి సంఖ్య హెచ్చుగా ఉంటుంది. తిరిగి 55-64 మధ్య వయస్సు వచ్చేంతవరకు వీరికి సంఖ్య తరగదు.

### వివాహ పరిస్థితి

అమెరికాలో 14 సంవత్సరాలు ఆపైన వయస్సు వచ్చిన వారిలో దాదాపు అయిదింట నాలుగువంతులు మంది వివాహితులయినవారే. వివాహంచేసుకోనేవారుగానో ఉంటారు.

ఈ పరిస్థితి శ్రామికబలగం కూర్పులో పెద్దమార్పు తెచ్చింది. పెళ్ళయినవారిలో పదింట మూడువంతుల మందికంటే ఎక్కువగా బయట పనిచేయరు. అయినా జనాభాలో వారి సంఖ్యాధిక్యతవల్ల స్త్రీ కార్మికులలో సగంవరకు వారే ఉంటుంటారు.

అవివాహిత స్త్రీ కార్మికుల సంఖ్య దాదాపు నిలకడగా ఉంటూ ఆశ్చర్యం కలిగిస్తుంది. 1940 లోలాగానే ఈ నాడుకూడా మూడోవంతు మంది వీరే ఉన్నారు. అలానే విధవలైనవారు, విడాకులిచ్చినవారు, భర్తలనుండి వేరైనవారి సంఖ్యలోకూడా 1940 నాటికీ ఈ నాటికి ఏమంత మార్పులేదు.

### కుటుంబ పరిస్థితి

అమెరికాలో 1955 లో 40,000,000 సంసారాలు ఉన్నవి. ఇందులో 5,000 000 కుటుంబాలకు స్త్రీలే యజమానులుగా ఉన్నారు. ఇందులో సగానికి పైగా ఉద్యోగాలలో ఉన్నవారే. ఒక అయిదోవంతు మాత్రం దినభత్యాలు సంపాదించేవారు.

వీరుగాక 4,000,000 మంది కూతుళ్ళో, ఆడబిడ్డలో, అమ్మమ్మలో అలాంటి ఇతర బంధుత్వంగలవారో అయి ఈ కుటుంబాలలో ఉంటారు. వీరంతా సంపాదించేవారన్నమాట. వీరు తమ సంపాదనలో కొంత భాగం సంసారపు ఖర్చులకుగాను ఇస్తూఉండవచ్చు. మరొక 3,000,000 మంది స్త్రీలు కుటుంబాలకు దూరంగా ఉంటూ తమను తాము పోషించుకోటానికో లేక ఇతరుల నెవరినయినా పోషించటానికో పనిచేస్తారు.

పెళ్ళి అయిన తరువాత తొలిసంతానం కలిగేవరకు పనిచేసే కొత్త గృహిణులు, పిల్లలు పెద్దవాళ్ళయినందున తిరిగి పనుల్లో చేరే తల్లులు వీళ్లే స్త్రీ ఉద్యో

గుల సంఖ్య బాగా పెరగటానికి తోడ్పడేది. ఇక భార్యా భర్త లిద్దరూ ఉద్యోగాలు చేసే దంపతుల సంఖ్య 1950 లో 8,000,000 ఉండేది. 1955 నాటికి ఇది 10,000,000 కు పెరిగింది. వీరిలో 5,00,000 లలో మాత్రం భార్య ఒక్కతే పనిచేసే సందర్భాలు ఉంటవి. భర్త చదువుకొంటూ ఉండటమో, అశక్తుడై పోవటమో, రిటైరు అయ్యే వయస్సు దాటి పోవటమో అయి ఉంటుంది.

సంతానవతులైనవారిలో పూర్తికాలపు ఉద్యోగాలు చేసేవారు చాల అరుదుగా ఉంటారు. 1955 లో స్త్రీ ఉద్యోగులలో అయిదింట నాల్గు వంతులమందికెవరికీ 6 ఏళ్ళలోపు పిల్లలులేరు. కాగా నాలుగింట మూడు వంతులు మందికి 18 ఏళ్ళలోపు పిల్లలులేరు. భర్తలు మరణించినవారు, ప్రోషిత భర్తృతలయినవారు తమ కుటుంబాల పోషణకై పనులు చేయవలసి ఉంటుంది. ఇలాంటి పరిస్థితులలో ఉన్నవారిలో సగంమందికి పైగా పనుల్లో ఉన్నట్టు జనాభా లెక్కలనుబట్టి తెలుస్తున్నది.

## విద్య ; శిక్షణ

పాఠశాలలోను, కళాశాలలోను 1955-56 విద్యాసంవత్సరంలో 5-24 మధ్య వయస్సులోగల ఆడపిల్లలు 18,000,000 మంది చేరారు. వీళ్ళలో నూరింట 95 వంతులు మంది 7-17 మధ్య వయస్సులో వాళ్లు ఉన్నారు.

ఇక 25 సంవత్సరాలు దాటి వయోజనులైన స్త్రీల సగటున గ్రేడ్ స్కూలు విద్యాగంధం కలిగినవారు 1952 లో ఈ విషయంలోపు సగటు పురుషుని విద్యకంటే స్త్రీ విద్యే హెచ్చుగా ఉంది. (1952 తరువాత ఈ సంఖ్యా వివరాలు లభించలేదు.) ఈ సగటు స్త్రీ 10.4 ఏళ్లు స్కూల్లో గడిపింది. కాగా ఈ సగటు స్కూలు కాలం పురుషుల విషయంలో 9.7 సంవత్సరాలు మాత్రమే. వయోజన స్త్రీలలో నాలుగోవంతుమంది, పురుషులలో అయిదోవంతు మంది స్కూల్లో 12 సంవత్సరాలు పూర్తిచేసినవారు.

అయితే ఉన్న విద్యాసంస్థలలో మాత్రం పురుషులకంటే తక్కువమంది స్త్రీలు చదువుతున్నారు. 1955-56 లో కళాశాల ఆవరణలలోనే నివసిస్తూ చదువుకొనే మొత్తం విద్యార్థులలో మూడోవంతు ఆడపిల్లలున్నారు. వీరి సంఖ్య 1,000,000 ఉంటుందని అంచనా వేయబడింది. విద్యా సంవత్సరంలో 180,000 మంది విద్యార్థులతోపాటు 100,000 మంది విద్యార్థినులు మొదటి తరగతిలో డిగ్రీలు పుచ్చుకొన్నారు. రెండవ తరగతిలో మాత్రం 19,000 మంది అంటే విద్యార్థులకు రెట్టింపు సంఖ్యలో విద్యార్థినులు డిగ్రీలు పుచ్చుకొన్నారు.

కాగా 1954-55 సంవత్సరంలో మూడోవంతు స్త్రీలు బి. ఏ. డిగ్రీలు, మూడింట రెండు వంతులు మంది ఎం ఏ. డిగ్రీలు, నాలుగోవంతుమంది డాక్టర్ డిగ్రీలు పొందారు. ఇవిగాక లలితకళలు, సాంఘిక శాస్త్రం, ఇంగ్లీషు సాహిత్యం, ఆర్థిక శాస్త్రం విషయాలలో స్త్రీలు ఎక్కువగా బి. ఏ. డిగ్రీలు పుచ్చుకొన్నారు. డాక్టర్ డిగ్రీలు పుచ్చుకున్నవారిలో హెచ్చుమంది బయోలాజికల్ సైన్సు (జీవ శాస్త్రం), సైకాలజీ (మనస్తత్వ శాస్త్రం), ప్రాతిపదిక సాంఘికశాస్త్ర విషయాలు తీసుకొన్నారు.

అసంఖ్యాక స్త్రీలు ప్రయివేటు, ప్రభుత్వ ట్రైనింగు పాఠశాలల్లో వృత్తి, ఉపాధ్యాయ శిక్షణలు పొందుతున్నారు. 1955 లో ప్రభుత్వామోదం పొందిన నర్సుల ట్రైయినింగు స్కూళ్ళలో 100,000 మంది విద్యార్థినులు చేరారు. 1954 లో ప్రాక్టికల్ నర్సింగుకోర్సు 7000 మందిదాకా చదివారు. సెక్రెటేరియల్, కమర్షియల్ కళలు నేర్పే స్కూళ్లు అనేకం ఉన్నవి. పలు పెద్ద పట్టణాలలో సొగసు సాధన, క్షురకర్మ వంటివి నేర్పే పాఠశాలలు ఉన్నవి. కుట్టుపనులలో శిక్షణ ఇచ్చే స్కూళ్లు యూనియన్ సహాయం పొందేవి అనేకమంది స్త్రీలకు గౌనుల పరిశ్రమకు కావలసిన చక్కని శిక్షణ గరపుతున్నవి. మాజీ సైనికయోధులకు, సైనిక శాఖలలోని వారికో శిక్షణగరపటానికి ఏర్పాటయిన

న్యాళ్ళవల్ల బహుకొద్దిమందికి మాత్రమే ప్రయోజనం ఉంటుంది. కనుక ఫెడరల్ ప్రభుత్వం స్త్రీలకు ముఖ్యంగా పనికివచ్చేవృత్తి శిక్షణనిచ్చే కార్యక్రమాన్ని ప్రోత్సహిస్తుంది. 1954 55 లో దాదాపు 1,750,000 మంది స్త్రీలుగాని, యువతులుగాని ఈ కార్యక్రమంలో చేరుతున్నారు. వీరిలో ఎక్కువ మంది సంసార ఆర్థికవిషయాలు అభ్యసిస్తున్నారు. దాదాపు 125,000 మంది అమ్మకపు వృత్తిలో శిక్షణ పొందుతున్నారు. 90,000 మందిదాకా వ్యాపార, పారిశ్రామిక విషయాల శిక్షణకు చేరారు. వీరిలో సగంమందివరకు ఉద్యోగాలలో ఉన్నవారైనందున విశ్రాంతి సమయాలలో ఎప్పుడో కొంతసేపు ఈ శిక్షణ పొందేవారు. ఇక్కడ వంటకాలు, ప్రాక్టికల్ నర్సింగ్, మెడికల్ అసిస్టెంట్ పద్ధతులు, సొగసు కూర్పుపని, కమర్షియల్ కళలు, డ్రాఫ్టింగు, ఫొటోగ్రఫీ మొదలైనవి నేర్పుతారు. ఈ చదివే వారిలో ఎక్కువమంది కుట్టుపరిశ్రమలలోనో, ఆహార వస్తువ్యాపారంలోనో, ఎలెక్ట్రికల్ పరిశ్రమలలోనో వార్తావాహకశాఖలలోనో ఏదో ఒక ఉద్యోగం కావాలనుకొనేవారై ఉంటారు. మిగతావారు సాంకేతిక నైపుణ్యం పెంపొందించుకోవాలనుకొనేవారు.

## స్త్రీల వృత్తులు

గుమస్తా ఉద్యోగాలు, టైపిస్టు స్టెనోగ్రాఫర్ ఉద్యోగాలు ఆడవారు ఎక్కువగా చేసేవి. ఎక్కువగా కాలంగా చేసేవి. 1940 నుండి ఎలెక్ట్రికల్ శాఖల్లో పనిచేసేవారి సంఖ్య రెట్టింపయింది. ప్రస్తుతం మొత్తం ఆడవారిలో నూరింట 30 వంతులు ఈ శాఖలోనే ఉన్నారు. మొత్తం గుమస్తా పనుల్లో ఉన్నవారందరిలోనూ మూడింట రెండువంతులుమంది స్త్రీలు.

ఫ్యాక్టరీలలోనూ,వుత్పత్తి సంస్థలలోనూఇటువంటి ఆపరేటివ్ రంగాలలో స్త్రీలు ఆ తరువాత ఎక్కువగా పనిచేస్తున్నారు. 1940 నాటి ఈ పనుల్లోవున్న వారిసంఖ్యకంటే నేటిసంఖ్య 1,000.000 అదనంగా ఉన్నది. గతయుద్ధంవల్ల స్త్రీల ఆవశ్యకత హెచ్చింది. వుత్పత్తి విధానాలు త్వరితగతినిమారిపోయినవి. నిర్వహణ పని సులభంఅయింది. పనులల్లో బలం ప్రయోగించవలసిన వాటి అన్నిటిని యంత్రీకరణ మొనరించటం జరిగింది. ఇందువల్ల రాను రాను వుద్యోగాలు స్త్రీలు చేయుటానికి మరింత సుకరమైనవి. ఈ ఉన్నతస్థాయి ఆర్థికవిధానంలో స్త్రీల నిర్వహించవలసిన పనులు ఎక్కువవుతూ వస్తున్నవి.

స్త్రీలను ఎక్కువ పనిదొరికే రంగాలలో మూడవది సేవా వృత్తి. (ఇంట్లో పని ఇందు చేరదు) 1940-56 సంవత్సరాల మధ్య ఈ రంగంలో పనిచేసేవారి సంఖ్యలో 1,000,000 పెరుగుదల వచ్చింది. నిజానికి రెండు రంగాలుతప్ప మిగతా అన్నిటిలోని స్త్రీల ఉద్యోగాల సంఖ్య పెరిగింది. ప్రయివేటు ఇళ్ళల్లో పనిమనుషులుగా చేసే వారి సంఖ్యలో మాత్రం ఏమీ పెరుగుదలలేదు. స్త్రీ కార్మికల సంఖ్య నూరింట 7 వంతులు తరిగి పోయింది.

వృత్తులలో ఉన్న స్త్రీల సంఖ్య క్రమంగా పెరుగుతూ వస్తున్నది. 1940 నుంచి ఈ వృత్తులలో ఉన్న వారి సంఖ్యలో 5000,000 పెరుగుదల ఉన్నది. కాని ఇతర రంగాలతో వారి నిష్పత్తి మాత్రం తగ్గిపోయింది.

ఇంజనీరుంగు, వైద్యం, రసాయనిక శాస్త్రం, అక్కౌంటెన్సీ, లాయర్ వృత్తివంటి వాటిల్లో స్త్రీల సంఖ్య చాల తక్కువ. అయితే వాటిల్లో స్త్రీలకు అవకాశాలు హెచ్చుతున్నట్లు కనబడుతున్నది. వృత్తి నైపుణ్యంగల వ్యక్తుల అవసరం పెరగటం ఇందుకు కొంతవరకు కారణం.

ప్రొప్రయిటర్లుగానూ, మేనేజర్లుగానుఉండే స్త్రీల సంఖ్యకూడా పెరుగుతున్నది. 1940 నాటికి నేటికీ వీరి సంఖ్య రెట్టింపు అయింది. యిందులో సగంమంది కాఫీ, భోజన హోటల్లు, ఇన్సూరెన్సు తదితర సొంత వ్యాపార సంస్థలు నడుపుకొనేవారు. కంపెనీల ఆఫీసర్లుగాను, అడ్వర్టయిజింగు అధికారులుగాను

ఫ్యాషన్, ప్రచురణ వగైరా అనేక సంస్థల్లో కూడా ఇటీవల స్త్రీలు బాగా రాణిస్తున్నారు.

## ప్రభుత్వంలో స్త్రీలు

ఫెడరల్ ప్రభుత్వం 1955 లో 5000,000 మందికి పైగా స్త్రీలను సివిల్ ఉద్యోగాలలో నియమించింది. కొద్ది మంది—పురుషులంతగా కాకపోయినా పెద్ద బాధ్యతాయుతమైన ఉన్నత పదవులను కూడా నిర్వహిస్తున్నారు. ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రొఫెషనల్, గుమస్తా, అమ్మకం పనులలో ఉన్న మొత్తం సంఖ్యలో మూడోవంతు స్త్రీలున్నారు. స్టెనోగ్రాఫరు, టైపిస్టులు, కార్యదర్శులు, టెలిఫోన్ ఆపరేటర్లు, గృహ ఆర్థిక వేత్తలు, నర్సులు, లైబ్రేరియనులలో హెచ్చుమంది స్త్రీలు. రసాయన శాస్త్రవేత్తలలో పదోవంతు మంది, జీవశాస్త్ర వేత్తలలో నాలుగోవంతు మంది, సంఖ్యా వివరాల (స్టేటిస్టిక్స్) సేకరణ దారులలో దాదాపు అయిదోవంతు మంది ఆడవారు.

అమెరికా విదేశాల ఉద్యోగాలలో ఒక స్త్రీ రాయబారిగా ఉన్నది. 150 మంది స్త్రీలు ఫారిన్ సర్వీస్ ఆఫీసర్లుగా ఉన్నారు. ఇక మిగతా సిబ్బందిలో సగంమంది స్త్రీలే.

వీరుగాక 1955 లో 36.000 మంది స్త్రీలు సైనిక శాఖలలో పనిచేస్తున్నారు. వీరిలో ఆఫీసర్లు, సైనిక, వైమానిక, నావికా, జలాంతర్గామి శాఖలలో చేరి వివిధ ఉద్యోగాలలో పనిచేస్తున్నవారు కలరు.

ఒక సెనేటరీతోసహా 16 మంది అమెరికా కాంగ్రెసు (పార్లమెంటు) లో (1957–58 కాలానికి) సభ్యులుగా ఉన్నారు. స్థానిక, రాష్ట్ర, దేశ స్థాయీలలో అనేక ముఖ్య పదవులకు స్త్రీలు ఎన్నికై వాటిని నిర్వహిస్తున్నారు. (ఈ అన్ని ఎన్నికలలో గెలిచిన వారి ఫలితాలు ఫిబ్రవరిలో వెలువడిన 'విమెన్స్ నోట్సు' లో కలవు.)

## ఫ్యాక్టరీలలో మహిళలు

మొత్తం స్త్రీ ఉద్యోగులలో అయిదోవంతుమంది -అంటే 4,400,000 మంది మహిళలు 1955 లో ఫ్యాక్టరీలలో పనిచేస్తున్నారు. వీరిలో ఫ్యాక్టరీలలో ఆఫీసుపని, కర్మాగారపు పనికూడా చేసేవారున్నారు. వీరిలో నూరింట 60 వంతుల మంది వినిమయవస్తువుల ఉత్పత్తి కర్మాగారాలలో ఉన్నారు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ఫ్యాక్టరీలలో స్త్రీల సంఖ్య బాగా పెరిగింది. అప్పటినుంచి అలానే పెరుగుతూ ఉన్నది. ఇతర వస్తూత్పత్తి ఫ్యాక్టరీలన్నిటిలోనూ ఎలక్ట్రికల్ పరికరాల ఫ్యాక్టరీలలో ఎక్కువమంది పనిచేస్తున్నారు.

## కార్మిక సంఘాలు స్త్రీలు

దాదాపు 3,000,000 మంది స్త్రీలు 1954 లో జాతీయ, అంతర్జాతీయ కార్మిక సంఘాలలో సభ్యులుగా ఉన్నారు. మొత్తం కార్మిక సంఘాల సభ్యులలో ఆరోవంతు మంది స్త్రీలు.

జాతీయ, అంతర్జాతీయ కార్మిక సంఘాలలో దేనికి స్త్రీ సభ్యురాలు అధ్యక్షురాలుగా ఉన్న సందర్భంలేదు గాని అయితే స్త్రీ సభ్యులు ఎక్కువగా ఉన్న సంఘాలలో ఒక స్త్రీ సభ్యురాలు ఉపాధ్యక్ష పదవిలో ఉండటం, ఆవిడ సహజంగా కార్యవర్గంలో సభ్యురాలుగా ఉండటం జరుగుతున్నది. చాలమంది స్త్రీలు కార్యదర్శులు గాను, ట్రెజరర్లుగానూ, కార్యనిర్వాహక వర్గ సభ్యులుగానూ ఉన్నారు. స్థానిక రాష్ట్ర ప్రాంతీయ స్థాయిలలోనూ, నగర కేంద్ర సంస్థలలోనూ స్త్రీలే ఎక్కువగా ఎన్నిక పదవులలో ఉంటున్నారు. దుకాణాల మేనేజర్లలో ఆడవారు ఎక్కువగా ఉన్నారు.

ట్రేడ్ యూనియనులలో అనేక మంది స్త్రీలు ఉద్యోగపదవులకు నియమితులైనారు. ఉదాహరణకు విద్యా, పరిశోధన డైరెక్టర్లుగాను, ఎడిటర్లుగానూ, స్త్రీల శాఖాధిపతులుగానూ ఉన్నారు. మరికొందరు

సాంఘిక భీమా విషయాలు చూచేవారుగా ఉన్నారు. తరచు సందర్భాలలో కార్మిక సంఘాల సామూహిక సేవా కార్య కలాపాలు చూస్తూ ఉంటారు.

## సంపాదన ఆదాయాలు

శిక్షణ, అనుభవం, ఆయా ఉద్యోగాలకు కావలసిన నేర్పు, వ్యక్తుల పటిష్ఠత మొదలైన వాటినిబట్టి వారి జీతాలలో తేడా ఉంటుంది. స్త్రీ అయినా పురుషుడయినా అంతే. ఇవిగాక మార్కెట్ స్థితి, స్థానిక పరిస్థితులు, కొన్ని సందర్భాలలో ఆ యేటి తరుణపు తీరు వీటన్నిటిమీదకూడా ఇది ఆధారపడి ఉంటుంది. ఏమయినప్పటికీ స్త్రీల సగటు సంపాదన పురుషుల దానికంటే నికరంగా, బాగా తక్కువగా ఉంటుందనేదానికి ఈ కారణాలు వర్తించవు.

స్త్రీలలో కొందరు కొంతకాలంపాటు మాత్రమే పనిచేసేవారనే విషయాన్ని దృష్టిలో పెట్టుకోవలసి ఉంటుంది. 1955 లో ఒక సందర్భంలో పనిలో ఉన్న 27,700,000 మంది స్త్రీలలోనూ నూరింట 29 మంది తక్కువ గంటలో, తక్కువ రోజులో పని చేసేవారు ఉన్నారు. మామూలుగా వారానికి 35 గంటలు పని చేస్తారు. ఆయా రంగాలలో నూరింట పదిమందిగల తోటి మగ కార్మికులతో పోల్చితే స్త్రీలు తక్కువ కాలం పనిచేశారన్నమాట.

స్త్రీలు తరుచుగా తక్కువ జీతాలుగల ఉద్యోగాలలో ఉంటారు. ఈ రంగాలలో తక్కువ నేర్పు సరిపోయే ఉద్యోగాలన్నమాట. ఇందువల్లకూడా స్త్రీల సంపాదనకు, పురుషుల సంపాదనకు తేడాలు ఉండటం జరుగుతుంది.

జీతాల రేట్ల విషయంలో పని గంటల సంఖ్య కూడా ఒక కారణమే. చాలమంది స్త్రీలు తక్కువ గంటలు పనిచేస్తారు. మరికొన్ని సందర్భాలలో స్త్రీలు కొన్ని సంవత్సరాలపాటు పని మానివేసి ఇంటివద్ద ఉండి తిరిగి పనిలో చేరటం కద్దు. అందువల్ల ఉద్యోగాలలో సీనియారిటీని వారు కోల్పోతుంటారు. అందుచే జీవితాలలో పురుషులతో సమానమైన పెంపుదలరాదు.

ఇక ఇవన్నీగాక స్త్రీలుకూడా పురుషులతోపాటే అదేపని అన్ని గంటలు చేసినప్పటికీ అన్ని సందర్భాలలోనివారికి పురుషులతోపాటు సమాన జీతాలు ముట్టవు. ఈ అక్రమ తారతమ్యాన్ని తొలగించటానికి చట్టాల ద్వారానూ, సమష్టి బేరాలద్వారాను, ప్రజా ప్రబోధాలద్వారాను ప్రయత్నం జరుగుతున్నది.

## ఉద్యోగ ప్రమాణాలు

స్త్రీల ఉద్యోగాల అంశాలను క్రమ బద్ధం చేస్తూ అన్ని ప్రాంతాలలోనూ అన్ని రాష్ట్రాలలోనూ (52 జూరిస్ డిక్షన్స్) చట్టబద్ధ ప్రమాణాలు ఏర్పాటు చేయబడినవి. వేతనాలకు, కనీస, సమాన వేతనాలకు, పని గంటలకు, గరిష్ఠ దిన, వార గంటల సంఖ్యకు వారపు సెలవుకు, భోజన, విరామ కాలాలకు, రాత్రివేళ పనిచేయటానికి, పారిశ్రామిక గృహకృత్యం, కటువైన, అనారోగ్యకరమైన రకాల, పరిస్థితులుగల పనులకు ప్లాంటు సౌకర్యాలు, ప్రసూతికి ముందు వెనుక ఉద్యోగ నియమకానికి ఈ ప్రమాణాలు వర్తిస్తవి.

అన్నిరాష్ట్రాలు ఈ అన్ని విషయాలమీదా ఇంకా చట్టాలు చేయలేదు. వివిధ అంశాలమీద వేరు వేరు రాష్ట్రాలు చేసిన చట్టాలలో తేడాలు ఉన్నవి. ఈ చట్టాలలో ఇళ్ళల్లో పనిచేసేవారిని చేర్చవద్దన్న భారం ఒకటి వున్నది. అయితే ఇటీవల సాంఘిక భద్రతా చట్టాన్ని సవరించటంతో ఈ ఇళ్ళలో పని చేసేవారిలో ఎక్కువమందికి చాల ప్రయోజనం కలిగింది.

## కనీస వేతనాలు

మొదట (1938 కు ముందు) చేసిన రాష్ట్ర కనీస వేతనాల చట్టం స్త్రీల రక్షణకు గని కార్మికులకొరకు తలపెట్టబడింది. ఉత్పత్తి సంస్థలలో వేతనాల పెంపకానికి ఇదిబాగా తోడ్పడింది. 33 జూరిస్ డిక్షన్లలో

అమలులోగల మరొక చట్టం (మూడవది) ఇప్పుడు పురుషులకుకూడా వర్తిస్తున్నది. ఎక్కువ భాగం, వ్యవసాయం, ఇంటి పనులు తప్ప మిగతా అన్ని వృత్తులకూ, అన్ని పరిశ్రమలకూ వర్తిస్తున్నవి. ఆచరణలో కనీస వేతన చట్టాలు ఎక్కువగా స్థానిక వ్యాపారం, సేవాపరిశ్రమలకు మాత్రం వర్తిస్తున్నవి.

ఫెడరల్ ప్రభుత్వపు సక్రమ కార్మిక ప్రమాణాల చట్టం (దీనినే ఫెడరల్ వేతన, పనికాల నిర్ణయ చట్టం అంటారు) మొదట 1938 లో చేయబడింది. దానిని ఇటీవల 1955 లో సవరించారు. ఇది ప్రాతిపదిక వేతనం, పని గంటల నిర్ణయ ప్రమాణమూ స్త్రీ, పురుషులందరికీ అదనపు గంటలు పనిచేసినప్పుడు ఇవ్వవలసిన వేతనమూ మొదలైన వాటిని నిర్ణయిస్తుంది.

## సమాన వేతనాలు

ఫెడరల్ ప్రభుత్వం 1923 లో దాదాపు తన ఉద్యోగులందరికీ ఉద్యోగాలనుబట్టి స్త్రీ పురుష విచక్షణ లేకుండా జీతాలు ఇచ్చే ఏర్పాటు చేసింది. 16 రాష్ట్రాలలోనూ అల్కాలోనూ సమాన వేతన చట్టాలను ఆమోదించటం జరిగింది. (అంటే మొత్తం పనిచేసే స్త్రీలలో సగంమందికి ఇవి వర్తిస్తున్నవన్న మాట). రెండు రాష్ట్రాలలో ఈ చట్టాలు ప్రయివేట్ ఉద్యోగాలకు ప్రభుత్వ ఉద్యోగాలకుకూడా వర్తించేట్లు చేశారు. రెండు రాష్ట్రాలలోతప్ప మిగతా అన్నిచోట్ల అన్ని చట్టాలు అన్ని రకాల ప్రయివేటు ఉద్యోగాలకు వర్తిసవి. ఆ రెండు రాష్ట్రాలలో మాత్రం ఈ చట్టాలు ఉత్పత్తి కర్మాగారాలకు మాత్రమే వర్తిస్తున్నవి.

ఒకేరకం ఉద్యోగం చేసే స్త్రీ, పురుష వుపాధ్యాయులకు ఒకేరకం వేతనాలు వుండాలని శాసించే చట్టాలు 16 రాష్ట్రాలలోనూ కొలంబియా జిల్లాలోనూ అమలులో వున్నవి. అనేక స్కూళ్ళలో స్థానిక పాఠశాలా బోర్డు చర్యల ద్వారా స్త్రీ, పురుష వుపాధ్యాయులకు సమాన వేతనాలను అమలు జరుపుతున్నవి.

ప్రస్తుతానికి అంతర రాష్ట్ర పరిశ్రమకు వర్తించే ఫెడరల్ సమాన వేతన చట్టాలేమి లేవుకాని ఇటీవల పలు కాంగ్రెసు సమావేశాలలో ఈ విషయమై పరిశీలన జరిగింది. 85 వ కాంగ్రెసు సమావేశంలో ఈ చట్టం నిస్సందేహంగా ఆమోదించబడుతుంది.

## పనిగంటలు

రోజులో పనిచేయవలసిన గంటల సంఖ్యను లేదా వారంలో పనిచేయవలసిన గంటల సంఖ్యను లేదా రెంటినీ నిర్ణయించే రాష్ట్ర శాసనాలు కలవు. వాటికి మించి స్త్రీలచేత పనిచేయించటాన్ని నిషేధించబడింది. అయితే అత్యవసర సందర్భాలలో మాత్రం ఇందుకు మినహాయింపులు అనుమతింప బడగలవు. విశ్రాంతి దినమూ, రోజులో భోజన, విరామ కాలాలు, రాత్రివేళ పని కాలాలను నిర్ణయించే చట్టాలుకూడా కొన్ని కలవు. ప్రతి రాష్ట్రానికి అన్ని రకాల పని గంటలు నిర్ణయించే చట్టాలు లేవు. మూడు రాష్ట్రాల లోమాత్రం స్త్రీలకు పని గంటలను నిర్ణయించేచట్టాలే లేవు.

మొదట మెసాచుసెట్స్ రాష్ట్రం 1879 లో చెల్లదగిన శాసనాన్ని ఆమోదించటంతో 44 కోర్టు అధీన ప్రాంతాలు దిన, వార లేదా ఉభయగంటల ప్రమాణాలను నిర్ణయించినవి. వీటిలో 25 ప్రాంతాలలో రోజుకు గరిష్ఠ పనిగంటలు 8, వారానికి 48 గా నిర్ణయించినవి. మూడు ప్రాంతాలలో గరిష్ఠ సంఖ్య నిర్ణయించలేదుగాని నిర్ణీత గంటల తరువాత పనిచేసినందుకు అదనపు వేతనం చెల్లించాలని నిర్ణయించినవి. గంటల చట్టాలవల్ల అనుమతించబడిన దానికంటే అమెరికా పనివారం చాల తక్కువగా వుంటుంది. సాధారణం 40 గంటల 5 రోజులపని వారాలు ఎక్కువగా కనపడతవి. కొన్ని వృత్తులలో అయితే ఇంకా ఈ పరిమితి తగ్గించాలనే ధోరణి వున్నది.

వారంలోఒకరోజు సెలవు ఖాయ పరచటానికని

23 జూరిస్ డిక్షన్ ప్రాంతాలలో వారానికి ఆరు రోజులు పనిచేయించాలని కొన్నిచోట్ల అన్ని పరిశ్రమలకు కొన్నిచోట్ల కొన్నిటికి నిర్ణయించబడింది. ఆదివారం, లేదా ఏడవరోజు పని చేయించే యెడల అదనపు వేతనం చెల్లించాలని మూడు ప్రాంతాలలో నిర్ణయించబడింది. 28 జూరిస్ డిక్షన్ ప్రాంతాలలో స్త్రీలకు భోజన విరామ సమయాన్ని నిర్దిష్టంగా నిర్ణయించాలని కొన్నిచోట్ల అన్నిటి విషయంలోను కొన్ని చోట్ల కొన్ని విషయాలలోనూ నిర్ణయించబడింది. 8 ప్రాంతాలలో విరామ సమయాన్ని నిర్ణయించారు. 21 ప్రాంతాలలో రాత్రిపూట స్త్రీలు పనిచేసే గంటలకు ఒక పరిమితి ఏర్పరిచారు.

## ఇతర నిబంధనలు

స్త్రీలకు ఆసనాలు ఇవ్వాలని 49 జూరిస్ డిక్షన్ ప్రాంతాలలో నిర్ణయించారు. 11 ప్రాంతాలలో స్త్రీల బరువులు ఎత్తటం మోయటంపైన కొన్ని నిబంధనలు ఏర్పరిచారు. 17 ప్రాంతాలలో స్త్రీలు గనులలో పనిచేయటాన్ని నిషేధించారు. ఆరోగ్యానికి రక్షణకు భంగకారులుగా ఎంచబడే వివిధ వృత్తులలో స్త్రీలచేత పనిచేయించటాన్ని నిషేధిస్తూ 7 ప్రాంతాలలో నిర్ణయించారు.

పారిశ్రామికుడు కొంత పని అప్పగిస్తే కార్మికులు దానిని తమ ఇంటివద్ద పూర్తిచేసి తెచ్చియిచ్చే పద్ధతి ఒకటి వున్నది. దీనిని 20 ప్రాంతాలలో నిషేధించటంగాని, దీనికి కొన్ని నిబంధనలు ఏర్పాటుచేయటంగా కొన్ని వృత్తుల విషయంలో జరిగింది.

ప్రసూతికి ముందు వెనుక కొన్ని వారాలు స్త్రీలు పనిచేయటాన్ని కొన్ని ప్రాంతాలలో నిషేధించారు. ఒక రాష్ట్రంలో పనిచేసే స్త్రీకి ప్రసూతికి ముందు ఆరు వారాలు వెనుక ఆరు వారాలు పనిచే డబ్బు ముట్టే ఏర్పాట్లు వున్నవి.

## వ్యాఖ్య

ఫెడరల్, రాష్ట్ర చట్టాలద్వారా స్త్రీల ఉద్యోగాలకు గల నిర్బంధాలను గురించి ఈ వ్యాసంలో చిత్రించటం జరిగింది. వివిధ కార్మికుల ఆరోగ్యం, సంక్షేమాలను కాపాడుటకు ఈ చట్టాల లక్ష్యం. అమెరికాలో కొన్ని వుద్యోగ వగతులను, స్థితి గతులను నిషేధించటం ద్వారా మొత్తంమీద ఈ ఆశయం సాధించబడింది. నిర్దిష్ట వేతనాలు, పని నిబంధనలు ఏర్పాటు ద్వారాకంటే ఈ నిషేధాల ద్వారా అది సాధించబడింది.

కనీస, ప్రాతిపదిక ప్రమాణాలను చట్టం ద్వారా నెలకొల్పటంవల్ల స్వచ్ఛందంగా ఇంకా వున్నత ప్రమాణాలు నెలకొల్పగోరేవారి వుత్సాహాన్ని ప్రోత్సహించినట్లవుతుంది. విస్తృతమవుతున్న ఆర్థిక విధానము, కొనసాగుతున్న సాంకేతికాభివృద్ధి, కార్మికునిలో పెంపొందుతున్న ఉత్పత్తి శక్తి, సమష్టి బేరమాడే విధానమూ ఇవన్నీ ఆచరణలో వున్నతవుద్యోగ ప్రమాణాలను ప్రేరేపించటానికి తోడ్పడినవి.

# బ్రహ్మ సాక్షాత్కారము

శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ



అధిప ! గోకర్ణ క్షేత్రంబునందుఁ జేరి
హస్తములనెత్తి, ఘోరమైనట్టి తపము
మహితగతినిఁ బంచాగ్నుల మధ్యనందు
నిలిచి, యాభగీరథుడంత సలుపుచుండె.

పెక్కువేలేండ్లు గడఁచెను నిక్కముగను
అట్టి ఘోర భయయుతమైనట్టి తపము
గాంచి, యావిరించి ముదంబు గాంచినాఁడు
ఆ భగీరథు కష్టంబులంతరించె.

అఖిల విబుధులు దనతోడ నలరుచుండ
లోకనాయకుఁడు విధిసుశ్లోక మూర్తి
సృష్టికారుండు, దివ్యుండు, చిన్మయుండు
ఆ భగీరథునకును బ్రత్యక్షమయ్యె.

అధిప! నీవు గావించినయట్టి తపము
మెచ్చినాఁడను నందుచే వచ్చినాఁడ;
ఎంచికొనుము నీవేమి వాంఛించినావొ?
యనుచు నలువ వచించిన యంతనతఁడు.
నిరుపమాన పరాక్రమాన్వితుఁడైన
యాభగీరథుఁడుముదంబు నంది మదినిఁ
గరయుగంబును మోడ్చి వేగంబుగాను
బ్రహ్మదేవునితో నిట్లు పలుకఁబూనె.
ఓ మహాత్మ! నాపైఁగృపనొంది తేని
నిజము తపము సఫలమగునేని వేగఁ
దనరి సగరాత్మజులు జల తర్పణంబు
వడయుదురుగాక వారుణావలన దేవ!
వారిదేహ భస్మంబు దివ్యంబునైన
జాహ్నవీ నదిఁదడిపినఁజాలు; నందు
చేతవారు స్వర్గమునకుఁ జేరఁగలరు
మొదటి కోరిక నిదియె నాకొదవఁజేయు.
ధాత ! యిక్ష్వాకులకును సంతానమిమ్ము!
మందుచేత మద్వంశంబు నవనియందు
నాశిర్వితముజెందు, నిదె నాదు స్వాంత మందు
కోరియుండిన రెండవ కోర్కె నభవ!
అఖిలలోక పితామహుఁడైన యజుఁడు
రెండు వరముల వాంఛించి యుండునట్టి
యా భగీరథునీక్షించి యతిమనోహ
రమగు శబ్దార్థయుతముగ రహిఁబలికె.
ఓ భగీరథ! యా వాంఛలొప్పుఁగాని,
మొదలికోరిక దుర్లభము గద! యయిన
నీకు నీ జేరఁగఁగలదు నిశ్చయముగ
నింక నీదువంశంబు సంవృద్ధిఁజెందు
అమల జాహ్నవి హిమవంతు నగ్రజాత
నట్టిదానిని ధరియింప గట్టివాఁడు
శివుఁడె; యందుకొఱకు నీవు భవుని వేగఁ
బ్రార్థనన్ జేయు; కార్య సంసిద్ధి కొఱకు.
గంగ దివినుండి పడిన వేగంగ, దాని
పాటు భరియింప ధరణికి వలనుపడదు;
గాన శివుఁడె ధానిధరింపఁగలఁడు గాన
భూత పతినిఁగొరి ఫలము బ్రీతిఁబొందు.
నలువ యీ లీల నతనికిఁ బలికి, గంగఁ
గాంచి, యీతఁడు నిన్ను వాంఛించు వేళ
వెంటఁబొమ్మని తెలిపి, వే వేగనమర
వరులతోడ స్వర్గమునకు నరిగినాఁడు.

('వాల్మీకి రామాయణము'నుండి)

# ఉత్తమ విధానపు జీవన ప్రమాణాలు

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయిక, ఆహారోత్పత్తులు ఎక్కువగా పురోగమించాయి. ద్వితీయ ప్రణాళికా కాలంలో పెద్ద, చిన్న నీటి పారుదల ప్రాజెక్టు రూపాలలోను, ప్రతి ఒక్కొక్క యకరం భూమికీ భూసత్తువు కలిగించే నూతన విధానపు ఎరువులు ఫెర్టిలైజర్లు, అభివృద్ధి కావింపబడిన విత్తనములు ఎక్కువగా ఉపయోగించుటయందు ఫలితములు ఇంకా ఉచ్చ స్థితికి తేబడగలవు. ద్వితీయ ప్రణాళికా లక్ష్యాలు సిద్ధించడంతోటి సామాన్య మానవునికి నిత్య జీవనావసరములు పుష్కలముగా సిద్ధింపజేయబడగలవు.

వస్తుతః ఒక వయోజనుని ఆహారం 17.2 ఔన్సులనుండి 18.3 ఔన్సులవరకు పెరుగును. వీటితో పంచదార 1.4 ఔన్సులనుండి 1.7 ఔన్సులవరకు పెరుగును. కాగా ప్రత్తి, జనపనార ఉత్పత్తులు వరుసగా 2.3 మిలియనుల టన్నులకు, 1.5 మిలియనుల బేళ్ల టన్నులవరకు పెరుగగలదు.

ద్వితీయ ప్రణాళికకు అగు మొత్తం ఖర్చులో 11.8 శాతము అనగా 568 కోట్ల రూపాయలు వ్యవసాయానికి, కమ్యూనిటీ ప్రాజెక్టులకు కేటాయించబడింది. వీటితోబాటు నేషనల్ ఎక్స్టెన్షన్ సర్వీసు (జాతీయ విస్తరణ సేవలు) క్రిందకు గ్రామ సీమలన్నీ తేబడగలవు. చేపలను పెంచుట, వ్యవసాయము, పశువుల పెంపకం, అడవుల పెంపకము మొదలగువాటివల్ల కలిగే లాభాలు అత్యావసరములగు నీటి, విద్యుచ్ఛక్తుల సదుపాయములవలని లాభములు స్వసహకారిగా ఉపయోగపడతాయి.

ద్వితీయ ప్రణాళికా కాలంలో 21 మిలియనుల ఎకరాలకు పైబడి భూమి సాగుచేయబడును. ఈవిధంగా మొత్తం మీద సాగులోకి తేబడ్డ భూమి 88 మిలియనుల యకరములు. మన పరిశ్రమలకు, గ్రామములకు వినియోగార్థమైన విద్యుచ్ఛక్తి 3.4 మిలియనుల కిలోవాటులనుండి 6.9 మిలియనుల కిలోవాట్ల వరకు పెంచబడును. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రతియొక్క రూపాయితో 3 అణాలకు పైగా నీటి పారుదల, విద్యుచ్ఛక్తులపై వినియోగించడానికి కేటాయింపబడింది.

ద్వితీయ

## పంచ వర్ష ప్రణాళిక

జాతీయాభివృద్ధి కొరకు



# సిరిసిరిమువ్వలు

'భగవాన్ దాస్'

ఇద్దరు మిత్రులకు వివాదంవచ్చి హోరా హోరిగా వాగ్వాదం జరిగింది. కాని గెలుపు ఓటమి తేలిందికాదు. చివరకు యిద్దరకు తమ వివాదమును మరునాడుదయం 7 గం టలకు తుపాకులతో పోరాడి జయాపజయ ముల నిర్ణయించుకోదలచారు.

మరునాడుదయం 7 గంటలకు ఇద్దరిలో నొకడు తుపాకితో పోరాడడానికి వచ్చి సిద్ధమయ్యాడు. 5 నిముషములు తాళిన తరువాత మరొకడు ఒక చీటి "నేను రావడమునకు ఒకవేళ ఆలస్యమైతే నా కొరకు వేచియుండవద్దు; నీ పనిని నీవు సాగనియ్యి" వ్రాసి పంపాడు.

♦ ♦ ♦

ఒక భూస్వామి తన తోటను, తోట మాలి వెంటరాగా తనిఖీచేస్తూ చాలతృప్తి పడి "ఈ చెట్టు ఇంత పెద్దదిగాను, అందం నుగా పెరగడం ఆశ్చర్యంగాలేదూ!" అన్నాడు.

"చిత్తం, అంతకంటె అదిచేయగలిగింది మరేముంది చెప్పండి!" అన్నాడు తోట మాలి.

♦ ♦ ♦

ఇద్దరు న్యాయమూర్తులు నిర్ణీతమైన వేగమును మించి కారునడిపినందుకు పోలీసులు వారిని న్యాయస్థానమునకు తీసికొని వచ్చారు. వారిని విచారించుటకు మరెవ్వరు న్యాయమూర్తులు లేకపోవడంవలన ఒకరి నొకరు విచారణ జరుపునట్లు ఏర్పాటు జరిగింది.

మొదటి న్యాయమూర్తి రెండవ న్యాయ మూర్తిని విచారణచేస్తూ "నీవు నిర్ణీత వేగ మునుమించి మోటారు నడిపినందుకు నేరము మోపబడింది" అన్నాడు.

"చిత్తం"

"నీకు యిందుకుగాను రు. 50-లు జరి మానా విధించబడింది"

"చిత్తం; అలాగే"

రెండవ న్యాయమూర్తి మొదటి న్యాయ మూర్తిని విచారణ చేస్తూ ఈ "మధ్య నిర్ణీత వేగమును మించి మోటారుకార్లను నడుపడం సాధారణమగుట ప్రజా భద్రత దృష్ట్యా ఉపేక్ష చేయదగినదికాదు. ఈ ఉదయం మాత్రం యిలాంటివి రెండు నేరాలు, కాబట్టి యిందుకుగాను మీకు రు. 100/-లు జరిమానాగాని, 10 రోజులు కారాగార శిక్షగాని విధిస్తున్నాను" అని తీర్పు చెప్పాడు.

♦ ♦ ♦

టెలిగ్రాం యివ్వడానికి వెళ్లిన ఒక

వ్యక్తి పోస్టాఫీసువాళ్ళిచ్చిన కలంతో రెండు మాటలువ్రాసి "ఈ కలం మాగ్నకార్టా వ్రాయడానికి కింగ్ జాన్ వినియోగించినది లాగున్నది" అని తెలిగ్గా గుమాస్తాగా నున్న యువతితో అన్నాడట.

"మీ సందేహాలను తీర్చగలిగేది ఆ ప్రక్కనున్న గుమాస్తా; అక్కడ అడుగండి" అన్నదాయువతి.

◆ ◆ ◆

ఒక గ్రంథాలయంలో సారస్వతోపన్యాసాలిచ్చిన వక్తకు చివరి పారితోషికంగా గ్రంథాలయ నిర్వాహకులు ఒక చెక్కు యివ్వబోయారు.

దానిని స్వీకరించ నిరాకరించి ఆ మొత్తాన్ని ధర్మ కార్యాలకు వినియోగించ వలసినదిగా ఆయన కోరాడు.

"అయితే యీ మొత్తాన్ని మా గ్రంథాలయ ప్రత్యేక నిధితో చేర్చేయ్యమంటారా" అని కార్యదర్శి అడిగాడు.

"అలా వీలుకాదు; ఆ ప్రత్యేక నిధి ఎందుకు వినియోగించుటకుగాను?" అన్నాడు వక్త.

"రానున్న సంవత్సరము యిప్పటికంటె మంచి ఉపన్యాసకులను రప్పించుటకుగాను"

◆ ◆ ◆

"రాధా! ప్రపంచము గుండ్రముగా నున్నదా?"

"లేదు మాస్టరుగారూ!"

"అయితే బల్లపరవుగానున్నదా!"

"లేదండీ"

"గుండ్రంగా లేక, బల్లపరవుగా లేక మరెలాగుంది ప్రపంచం?" అన్నాడు మాస్టరు తీవ్రంగా.

"సంకుచితంగా నున్నదండీ!" అన్నది రాధ.




చిత్ర సమీక్ష

# 'భాగ్యరేఖ'

పొన్నలూరి బ్రదర్స్‌వారి 'భాగ్యరేఖ' చిత్రం యీ నెల 2-వ తేదిన మద్రాసు పారగన్ టాకీస్‌లో ప్రివ్యూ యివ్వబడింది. శ్రీ బి. యన్. రెడ్డిగారి దర్శకత్వపు విశిష్టతను నిరూపిస్తూన్న యీ చిత్రము యావదాంధ్ర దేశంలోను, తదితర ప్రదేశాలలోను జైత్రయాత్ర చేస్తున్నది.

ఈ చిత్రంలో ప్రజలను ఆకర్షించడానికని పొందు పరచబడిన చౌకబారు హాస్యంగాని, నృత్యవినోదాలు కాని, ప్రేమకలాపాలుకాని లేవు. ఉత్తమాదర్శాలను, నిజాయితీని, భగవంతునిపట్ల విశ్వాసమును ప్రబోధిస్తూ విజ్ఞాన వినోదములతో నొప్పుచున్నది. ప్రజల నైతిక పురోభివృద్ధులకు విశేషము తోడ్పడగలదీ చిత్రము.

చిన్నాయనలు, పెదనాయనలు ఎంత సంపన్న కుటుంబీకులైనా తల్లి తండ్రులను కోల్పోయిన బిడ్డలు వాళ్ల పంచలు చేరిన ఫలితంగా వారనుభవించు సంభవించు కష్టనిష్ఠూరాలు సహజంగా చిత్రించబడినవి. తన బిడ్డలోని లోపాలను గుర్తించకుండా ఆమెపై మమకారంతో దుర్నడతను అరికట్టలేక తమచెంత పెరుగుతున్న బావగారి కుమార్తెపట్ల ఈర్ష్యాసూయలతో ఆమెకు తలపెట్టిన ద్రోహం ఫలితంగా తను త్రవ్వుకున్న గొయ్యిలో తానేపడిన ఒక యిల్లాలు, నీతి నియమాలుతప్పి డబ్బుకాశపడి ఏపనిచేయడానికైనా తయారయ్యే ఒక 'ప్రైవేటు', ఆడంబరాలకు, అందని ఆశలకు అర్రులుచాచి చిత్రరంగంలో చేరుటకని పరాయి పురుషుని మాటలనునమ్మి లేచిపోయి సంఘంలో భ్రష్టయై చివరకు వీధులలో బిచ్చమెత్తుకునే స్థితికివచ్చిన నొక కన్య యీ చిత్రంలో అనేకులకు గుణపాఠం కాగలరు.

కష్టాలలో సుఖాలలోకూడ భగవంతునిపట్ల విశ్వాసము కలిగియున్నవారికి కష్టాలు వాటంతటవే గాలిమబ్బులలాగ తొలగిపోగలవనియు, ధర్మమే చివరకు జయముగుననియు చాటిన దిందులోని కథావస్తువు.

తను లక్షాధికారి బిడ్డయైనను దైవికంగా తను పంచచేరిన బీదయువతి గుణగణాలను, సౌందర్య లావణ్యములనుచూచి ముగ్ధుడై తన జీవిత భాగస్వామిగా చేసికొన తలపెట్టిన యువకుడు, అందుకు సమ్మతి తెలిపిన తల్లిదండ్రులు యీ నాడు కట్నకానుకల మోజుతో గుణగణాలను, మంచి చెడ్డలను సయితం లక్ష్యం చెయ్యక డబ్బు, ఆస్తిపాస్తులకొరకు ప్రాకులాడే సంపన్న యువకులకు, వారి తల్లిదండ్రులకు ఆదర్శప్రాయులు.

(162-వ పేజి చూడుడు)

# యాదవవీర చరిత్ర

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు



(గతసంచిక తరువాయి)

వలనొప్ప శ్రీనాథు వచనపద్ధతిని
సలిపెను యదుశాస్త్ర చరితమంతయును

అని చెప్పుకొన్నాడు. తర్వాత వారు ఈ మాటలను బట్టి శ్రీనాథుడు మొదట రచించేడనే అభిప్రాయాన్ని పడి ఉంటారు. కాని ఆ వాక్యం యొక్క సరియైన భావం తెలుసుకొండే అట్టి పొరపాటు జరుగదు.

### శ్రీనాథుని వచన పద్ధతి అంటే ఏమిటి?

వచన పద్ధతి అను మాటే మొట్ట మొదట వేరే భావాన్ని పుట్టిస్తూంది. పినయెల్లన్న మంజరిలో రాస్తూ, వచనంలో రాస్తున్నానని చెప్పుకోడమే అవకతవకగా ఉన్నట్టు కనబడుతుంది. వచనం వేరు, పద్యం వేరు. చిట్ట చివరకు కొందరు విమర్శకులు పద్యానికే కొందరు వచనమని చెప్పుతూ వచ్చేరని వ్రాయవలసివచ్చింది. వచన పద ప్రయోగాన్ని గురించి కొంచెం విస్తరిస్తాను. 'వచనము' అను మాటను కొందరు పద్యము, వచనము అను భేదం లేకుండ, 'వ్రాక్రుచ్చినది' లేక 'చెప్పినది' అను అర్థంలో వాడేరు, కాబట్టి వారి వచనానికి కీర్తన ఇత్యాదులన్నీ అర్థమె. మధువరపురి లింగనగౌడ అను కవి సారంగధరనాటకాన్ని • 11 యక్షగాన పద్ధతిని రచించేడు, దీనిలో కవి పాత్రలకుముందు-రత్నాంగి వచనము, సారంగధరవచనము. రాజు వచనము మొదలంగా వ్రాస్తూంటాడు. ఈ పాత్రలు చెప్పే వాటిలో కీర్తనలు, పద్యాలు, వచనాలు ఇత్యాదు లుంటాయి. కాబట్టి వచనం అను మాటకు హక్కు అని మాత్రమె అర్థం.

పినయెల్లయ్య తాను ఈ కావ్యాన్ని ఏ ఫక్కీలో రాయడం అని ప్రశ్నించుకొని శ్రీనాథుడు చెప్పిన విధంగా రాద్దామని తీర్మానించుకొన్నాడు. పుస్తకానికి పేరుపెట్టడం దగ్గరనుంచి అతన్ని అనుకరించ దలిచేడు. శ్రీనాథుడు తన పుస్తకానికి పల్నాటి వీరచరిత్ర అని పేరు పెడితే, పినవీరన్న తన గ్రంథానికి యదువీరుల చరిత్ర అని పేరు పెట్టేడు.

శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రలో ఒక కొత్త పద్ధతిని అవలంబించేడు. అతను కథను ప్రారంభం నుంచి రాయలేదు. మధ్య మొదలు పెట్టేడు. పూర్వ కథను మనం ఇతర గ్రంథాలనుంచి తెలుసుకోవలసిందే. అదే విధంగా పినయెల్లనకూడ కథను ప్రారంభంనుంచి చెప్పక మధ్యలో మొదలు పెట్టేడు. శ్రీనాథుడు యుద్ధ కలాపంతోను, భట్టురాయబారంతోను కథను ప్రారంభించేడు. పినయెల్లన్న కూడ ఆ పద్ధతినె అనుసరించేడు. శ్రీనాథుడు పల్నాటివీరుల యుద్ధాన్ని మాత్రమె వర్ణించేడు. పినయెల్లన్న కూడ యుద్ధకథను మాత్రమె వర్ణించేడు. నలగామరాజు అలరాజును చంపించేడు. అకసి తీర్చుకోడమె పల్నాటి వీరయుద్ధమయింది. అదే విధంగా కాటమరాజు కథలోకూడ కాటమరాజు తండ్రి ప్రోలరాజును నల్లసిద్ధిరాజు తాలూకువారు సంహరించేరు. కాబట్టి ఈ యుద్ధంలోకూడ పగయె పెద్ద కారణముయింది 'మాతండ్రి పగదీర్చి మమ్ము రక్షింపు' అని కాటమరాజు ప్రార్థించేడు. పల్నాటి వీర చరిత లో బ్రహ్మనాయుడు విష్ణువుయొక్క అవతారం. కాటమరాజు కథలో కాటమరాజు విష్ణువు యొక్క అవతారం. బాలచంద్రుడు ఒక కొండ సైన్యాన్ని

• 11 సారంగధర నాటకము – వెస్టువార్డు కంపెని, మద్రాసు, 1947.

పరీక్షించినట్లైతే, కాటమరాజుకూడ ఒక కొండ నెక్కి సైన్యాన్ని చూసేడు. బాలచంద్రుడి ఖడ్గం మహిమకలది. అట్లే బీరన్న ఖడ్గంకూడ మహిమ కలది. దేవుడు ఇచ్చిన గజనిమ్మపండ్లను భక్షించగా ఐతమ్మకి బాలచంద్రుడు జన్మిచేడు. అట్లే గజనిమ్మపండ్లను పెద్దిమాదేవి భక్షించగా కాటమ రాజు, పాపనూకమ్మ జన్మించేరు. ఇట్లు ఈ రెండు కథల కెన్నైన పోలికలు చూపించవచ్చు. ఇట్లు ఎల్లన్న శ్రీనాథుని వచనపద్ధతిని అనుసరించి - అనగా చెప్పిన విధానాన్ని అనుసరించి - కాటమ రాజు కథను రచించేడు. శ్రీనాథునివచన పద్ధతి అంటె రచన పద్ధతి అని భావం.

శ్రీనాథుడు ద్విపదలో రచించేడు. శ్రీనాథుని అనుసరించదలచి పినవీరన్న మంజరిలో వ్రాసేడు. కవిత్వాన్ని యెల్లన్న ఇట్లు తెలియ జేసేడు -

యతి ప్రాసలుండని యాకైతయేల
సుత గూడి నడవని సొగసుపదమేల

(పుట 18)

కాని ఈ గ్రంథంలో మంజరి కనబడుతూంది. ఈ రకం కథలన్ని ఒక్కరు రచించినవిగా భావించడానికి లేదు. అనేకమంది వ్రాసినవి కూడుతూంటాయి.

## శ్రీనాథుడు కాటమరాజు కథను రచించేడా?

గంగుల పినయెల్లన్న చెప్పిన శ్రీ 'నాథువచన పద్ధతిని' అనుపద బంధాన్నిబట్టి శ్రీనాథుడు కాటమ రాజు కథను రచించేడన్న అర్థం సబబు కాదు. కాని ఆ కవి మాటలనుబట్టి అనేకమంది శ్రీనాథుడు కాటమరాజు కథను రచించేడని పొరబాటు పడ్డట్లుగా కనబడుతూంది.

కాటమరాజు కథ అను పద్య ప్రబంధానికి కర్త యైన గుర్రంకొండ భక్తవత్సలకవి శ్రీనాథుడు కాటమరాజుకథను రచించేడని ఈ మొత్తముగా చెప్పేడు.

ఒక శుభదినమున నొగి శుభ్రమతి శౌరి
పూజావిధానంబు పొందు పఱచి
హరికథ విని విని యారాత్రినిద్రింప
శ్రీని వాసుండిట్లు చెప్పగలను
శ్రీనాథుడను కవిశ్రేష్ఠుండు ద్విపదగా
రచియించెఁ గాటమరాజు చరిత
మది నీవు నాపేరనంకితంబుగఁ బద్య
గద్యాత్మకంబుగా ఘనత నుడువు
మని పచించి తిరోహితుఁడయ్యె నంత
నేను మేల్కాంచి యాస్వామినెంచి
మదిని
గాల్య కృత్యంబులను దీర్చి కడుఁదలిర్చి
పండితావళింగను గొని భక్తిమెయిని.

* 12

ఈ కవి యొక్క కాలము ఇత్యాదులు తెలియవు. కవి ఇట్టి అభిప్రాయం పడడానికికూడ గంగుల పినయెల్లన్న యొక్క 'శ్రీనాథు వచన పద్ధతిని' అను మాటే కారణమని చెప్పవచ్చు.

నిజంగా శ్రీనాథుడే కాటమరాజు కథను వ్రాసి ఉంటె, పినయెల్లన మళ్లీ శ్రీనాథుని పద్ధతి మీద కాటమరాజు కథను వ్రాయవలసిన అవసరం ఎంత మాత్రమూ ఉండదు. కాబట్టి శ్రీనాథుడు కాటమ రాజు కథను వ్రాయలేదనె చెప్పాలి.

## జంగం కథ రచనా కాలం

కాటమరాజు కథ పన్నెండో శతాబ్దాంతంలో జరిగింది. అయితే గంగుల పినయెల్లయ్య ఆ కథను ఎప్పుడు గేయ ప్రబంధంగా వ్రాసేడు? పినయెల్లయ మహాకవి శ్రీనాథుణ్ణి (క్రీ. శ. 1380-1460) కేరొ-

* 12 ఆంధ్ర పత్రిక - విజయ సంవత్సరాది సంచిక 1953 - 54 పుట 35.

న్నాడు. కాబట్టి పినయెల్లన్న ఆటు తర్వాతివాడే అని స్పష్టమవుతూంది.

కాటమరాజు కథలో తుపాకులతో జరిగిన యుద్ధం ఇట్లు ప్రశంసింపబడింది. _

'తుపాకి విలుమూక తొమ్మిది లక్ష
తొక్కి సమసెను తుపాకి మూక
తూలి వేయుడి యావు తుపాకి గుండ'
(పుట 14)

93వ పుటలో తుపాకీలనుగురించి మరింత వివరంగా ఉంది. కాని ఈ తుపాకుల ప్రశంస గ్రంథ కాల నిర్ణయంలో పూర్తిగా తోడ్పడదు. తెలుగుదేశంలో యుద్ధాలలో తుపాకులను వాడడం చిరకాలం కిందటే ఉంది. 'బుక్కరాయల కాలంనుండియు విజయనగర సైన్యమునందు ఫిరంగి, తుపాకి మున్నగు నాగ్నేయ సాధనముల వాడుక యుండెనని మహమ్మదీయ చరిత్రల వలన దెలియవచ్చుచున్నది. † 13 ఈ వ్యాస కర్త తెలియజేసిన బుక్కరాయలు మొదటివాడో, రెండోవాడో తెలియదు. మొదటి బుక్కరాయల కాలం క్రీ. శ. 1354_79, రెండో బుక్కరాయలకాలం క్రీ. శ. 1404-6. అవన్నీ శ్రీనాథుని కంటె పూర్వసంగతులు. పిన యెల్లన్న తనకాలంలో ఫిరంగులతోను, తుపాకులతోను జరుగుతూన్న యుద్ధాలను చూసి కవిత్వంలో చేర్చేడని చెప్పవచ్చు. ఏదయినా ఫిరంగుల, తుపాకుల ప్రశంస మనకు పూర్తిగా కాలనిర్ణయంలో తోడ్పడలేదు.

ఈ గేయంలో అర్ఘణాల ప్రశంస ఇట్లుంది -

అవ్వుకై తెచ్చిరి అర్ఘణాల గంట
(పుట 47)

అర్ఘనాల జల్లుల అడ్డకత్తులవారు (80)

కాబట్టి ఇది బాగా ఇటీవలి రచన అని చెప్పవచ్చు' కాటమరాజు కథకి పీఠిక వ్రాసిన మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఈ కథలో చెన్నపట్టణంగురించి ఉండడంచేత ఇది పదునేడవ శతాబ్ది అంతమున గాని రచింపబడియుండవలెను' అన్నారు. అట్లే ఇతర విమర్శకుల అభిప్రాయమున్నూ. 'రచనను బట్టి చూడగా నతడు (ఎల్లన) యించుమించు పదునేడవ శతాబ్దమువాడు కాదగునని తోచుచున్నది. 14 ‡' కాబట్టి పినయెల్లన్న పదిహేడో శతాబ్దివాడని చెప్పవచ్చు.

## రచనకి ఆధారం ఏది?

అయితే ఇక్కడ ఒక సంగతి పరిశీలించవలసుంది. 12 వ శతాబ్దాంతంలో జరిగిన కథను ఎన్నో తబిసీళ్లతో 17 వ శతాబ్దాంతంలో రచించడం సాధ్యం కాదు. క్రీ. శ. 1800 ప్రాంతంలో చేర్చబడ్డ మెకంజి దొరగారి కైఫియత్తులలో కథ ఎంతో టూకీగా ఉంది. అటి సందర్భంలో పినయెల్లన కవి గ్రంథంలో ఎన్నో తబిసీళ్లు ఉండడానికి కారణం, ఈ కవి అప్పటివరకు వస్తూన్న జంగంపాటలను ఆధారంగా చేసుకొని ఈ గ్రంథాన్ని రచించడమే అని ఊహించవచ్చు. ఈ గ్రంథం ఆ గేయాల స్థానాన్ని ఆక్రమించుకొందని చెప్పవచ్చు. పూర్వం ఎప్పుడో జరిగిన కథను_పాటలలో ఉండే లోపాలతో కూడా_ తీసుకొని రచించడంచేతే కవి నెల్లూరి పాలకుడైన చోడుని పల్లవరాజుగా మార్చివేసేడు. ఇట్టి పొరపాట్లు జరుగుతూంటాయి. పద్నాలుగో శతాబ్దిలో రచించబడ్డ నవచోళ చరిత్ర అను దివ్యపదగ్రంథంలో త్రిలోచన పల్లవుడు అను రాజు చోడుడుగా వర్ణింపబడ్డాడు.

† 13 1953 మేనెల భారతిలో నేలటూరి వెంకట రమణయ్యగారు రచించిన కృష్ణ దేవరాయలు అను వ్యాసం 393 వ పుట.

‡ 14 ఆంధ్ర పత్రిక - విజయసంవత్సరాది సంచిక (1953 - 54) పుట 36.

## సమకాల రాజకీయ చరిత్ర

మధ్యాంధ్ర దేశ, ఉత్తరాంధ్ర దేశం మూడో కులోత్తుంగ చోళదేవ చక్రవర్తి (క్రీ. శ. 1178 – 1216) పరిపాలనలో ఉన్నాయి. అతను చాళుక్య-చోళ చక్రవర్తులలో ఆరోవాడూ, ఆఖరివాడును. ఈ రాజు అరవదేశాన్ని, ఆంధ్రదేశాన్ని కూడ కలిపి పరిపాలించేవాడు. ఇతని తరఫున ఆంధ్రదేశంలో మహామండలేశ్వరులైన వెలనాటి చోడరాజులు రాజ్యంచేసేవారు. వారు మూడో గొంతభూపతి (క్రీ. శ. 1178–1185), అతనికొడుకుపృథివీశ్వరుడు (క్రీ. శ. 1285–1207). కులోత్తుంగ చోళదేవచక్రవర్తికాలంలో సామ్రాజ్యం కూలిపోవడం ప్రారంభించింది. తెలుగు దేశపు అంచులలో అనేక చిన్న రాజులు ఉండేవారు. పొత్తపినాటిలో పరిపాలిస్తున్న తెలుగు చోళులు నెల్లూరును ముఖ్యపట్టణంగా చేసుకొన్నారు, వీరికి కమ్మనాటినుండి పొత్తపినాటి వరకు ఉండే చోడులు సాయపడ్డారు. అప్పటి నెల్లూరు పాలకుడు మొదటి మనుమసిద్ధిరాజు. అతని కుమారులలో రెండోవాడైన తిక్కరాజు ప్రతాపవంతుడు. 1207లో గూడూరు వద్ద జరిగిన యుద్ధంలో వెలనాటి పృథ్వీశ్వరుణ్ణి చంపేశాడు. ఇప్పటికింకా తిక్కరాజు బాలుడే, యువరాజే! అటుతర్వాత పద్దెనిమి దేళ్ళకుగాని అతను పట్టాభిషిక్తుడు కాలేదు.

పల్నాటిలో హైహయవంశజుడైన అనుగురాజు పాలిస్తున్నాడు. అతని అనంతరం అతని పుత్రులు రెండు కక్షలయ్యేరు. ఒక కక్షకి నాయకురాలు అధికారిణి, రెండోకక్షకి బ్రహ్మనాయుడు పెద్ద. వారుచేసిన పల్నాటి యుద్ధం (క్రీ. శ. 1178-82 మధ్య) చరిత్ర ప్రసిద్ధి చెందింది.

పృథివీశ్వరుని రాజ్యం ఉత్కల దేశంలో మహేంద్రగిరిదాక ఉండేది. అక్కడి కటక గాంగ రాజులు ఆ ఉత్తర ప్రాంతాన్ని కబళించదలుచుకొన్నారు. ఆ పని 1207 నాటికి పూర్తయింది.

కాకతి రుద్రరాజు వరంగలు రాజ్యాన్ని పెంపుచేసుకొంటున్నాడు. అతను పడమటివైపున దేవగిరి రాజులతో యుద్ధాలుచేస్తూ 1196 ప్రాంతాలలో మరణించేడు. అతని తమ్ముడు మహదేవరాజు ఓరుగంటిరాజై, నాలుగు సంవత్సరాలు మాత్రమే పాలించి దేవగిరి రాజులతో చేసిన యుద్ధంలోనే మరణించేడు. అతని కుమారుడైన గణపతి దేవుడు దేవగిరి చెరలో ఉంటూ క్రీ. శ. 1209 ప్రాంతంలో విముక్తుడై రాజ్యానికి వచ్చేడు. ఇతను రాజ్యానికి రాకముందె పృథివీశ్వరుడు అంతమొందేడు. గణపతి దేవుడు మహావీరుడు. చాళుక్య-చోడ చక్రవర్తి చేతిలోంచి తెలుగుదేశం గణపతిదేవుడి చేతిలోకి మారింది. ♦15.

## కాటమరాజు; నల్లసిద్ధిరాజు; ఖడ్గతిక్కన్న

కాటమరాజుకథ అతిశయోక్తిపుట్ట. కాబట్టి దానిని పూర్తిగా నమ్మి వ్యవహరించడానికిలేదు. దీనిలో ఉండే అంశాలు ఇతర నమ్మదగిన ఆధారాలతో సరిపడినప్పుడె వాటిని గ్రహించవలసుంది.

కాటమరాజుకథలో చారిత్రక పురుషులనబడేవారు_నల్లసిద్ధిరాజు, సిద్దయమంత్రి కుమారుడైన రణతిక్కన, కాటమరాజు.

కాటమరాజు ప్రశంస ఉన్న శాసనాన్ని గురించి వెనకే తెలియజేసేను. ఇతని కాలనిర్ణయాన్ని స్పష్టంగా తెలియజేయగల అంశంకూడ ఆ శాసన స్తంభంయొక్క మూడో ప్రక్క ఉంది. ఆ వాక్యభాగమేదంటె—

40 ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమున కా

41 టమరాజు రాజ్యంసేసి లింగమకొండ, యరగడ పాట,

42 ను నలసిద్ధిరాజుంగూడి యుద్ధంబుసేసి బుడుగులవారు,

15 ♦ భారతిజూలై 1953-వ సంచికలోని ముమ్మడి కులోత్తుంగ చోళదేవుడు అను వ్యాసం.

43 చనిపొయ్యే నాటికి—

ఆ స్తంభంయొక్క మూడో ప్రక్క మళ్లీ ఇట్లుంది.

23 ♦ ♦ ప్రతాపుని కాలము

24 న యెదుకులాత్మజులు

♦ ♦ ♦

29 పాంకనదు సిద్ధిరాజుకు పుల్లరి వొడంబడిభూమి అని ఉంది.

నాలుగో ప్రక్క ఆ యుద్ధం జరిగిన సంవత్సరమంటూ ఒక అంకె ఉంది. కాని అంకెలు సరిగా తెలియడంలేదనీ, బహుశా శా. శ. 1180 కావచ్చని శాసన సంపాదకులు తెలియజేసేరు.

పైశాసన భాగాలనుంచి ఈ యుద్ధం జరగడం, వీరుల మరణంకూడ ప్రతాపరుద్రుని కాలంలోనె అని స్పష్టంగా తెలుస్తూంది. కాని ఈ ప్రతాపరుద్రుడు మొదటి ప్రతాపరుద్రుడా లేక రెండో ప్రతాపరుద్రుడా అను ప్రశ్న బయలుదేరుతూంది. ఈ శాసనం క్రీ. శ. 1258 నాటిదని అనుకొన్నటయితే_ రెండో ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1295_1323 దాక పరిపాలించేడు, కాబట్టి _ శాసనంలో చెప్పబడ్డ అతను రెండో ప్రతాపరుద్రుడు అనడానికి సాధ్యం కాదు. ఇక మొదటి ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1140 నుంచి 1196 ప్రాంతాలదాక రాజ్యంచేసేడు. కాబట్టి కాటమరాజుకథ అతని కాలంలోనె జరిగిందని నిర్ణయమవుతుంది. అప్పటికి రణతిక్కన కాటమరాజుల మరణం 1196 కి పూర్వమె అని నిర్ధారణ అవుతుంది.

కాటమరాజు కాలంనాటికి తెలుగుచోళులు నెల్లూరినుంచి పరిపాలన చేస్తూన్నట్లుగా స్థానికకైఫీయత్తులనుంచి, కాటమరాజుకథ (జంగిమకథ) నుంచి కూడ తెలుస్తూంది. దక్షిణమందు ఏలుతూన్న చోళరాజులు నెల్లూరికి మనుమసిద్ధి (తిక్కరాజు తండ్రి) కాలంలో వచ్చేరు. కాబట్టి కేతనకృతమైన దశకుమార చరిత్రలో (3_వ పుటలో) మొదటి మనుమసిద్ధిరాజే నెల్లూరి మొదటిపరిపాలకుడని తెలియజేయబడింది. అతని కుమారుడైన తిక్కరాజు (1170-1234 కావచ్చు) చిన్నతనంలోనె గురుములూరి (గూడూరి) యుద్ధం చేసేడు. ఆ తర్వాత పద్దెని ఏళ్లకిగాని అతను రాజ్యానికిరాలేదు. 16 * కాబట్టి క్రీ. శ. 1196_మొదటి ప్రతాపరుద్రుని పరిపాలనయొక్క ఆఖరిసంవత్సరమని స్థూలంగా చెప్పవచ్చు_ ప్రాంతంలో మొదటి మనుమసిద్ధిరాజే నెల్లూరిరాజు. కాటమరాజుకథలో చెప్పబడ్డ నల్లసిద్ధిరాజు ఇతనే కావచ్చు. కాని కాటమరాజుకథలో అతిశయోక్తి లెక్కువ. కాబట్టి కాటమరాజుతో యుద్ధంచేసిన వాడు నెల్లూరిరాజేగాక ఆ రాజుయొక్క చుట్టం కావచ్చు. ఈ యుద్ధంలో ఎందరో తెలుగుచోళ్లు పాల్గొన్నట్లుగా కథలో ఉంది. వారి పేర్లు మరొకచోట తెలియజేస్తాను. (సశేషము)

* 16 భారతి జూన్ 1953, ముమ్మడి కులోత్తుంగ చోళదేవుడు వ్యాసం 543—వ పుట.

# అమాయకత్వం

శ్రీ బచ్చల మునికన్నయ్య

రత్నగిరి యను పట్టణంబున
రంగమ్మ అను యిల్లాలు
గారాబముతో పెంచుచుండెను
గంపదాశతో "రాజా" - ను
"రాజా" రోజా గంతులేయుచూ
రోజా చెట్టులా పెరిగాడు
నాన్నా - అమ్మా చూపులచలువలొ
నాలుగేడులు గడిచాయి
ఐదవయేడు అక్షరాలకై
అంపిరి బడికి రాజాను
పాఠశాల అను బోనులోపల
పాపము! రాజా! ప్రతిదినము
పంతులు చెప్పడి పాఠములినన్
బంతులాడుచు ఎగురగను
తినగ దెబ్బలను పాఠశాలకు
తీసెను బాగుగ నామాలు
రంగమ్మకు రాజా - మారాం
రగిలించెనుగ - గుండెలను
భర్త యింటికి రాగా చెప్పెను
బడికి పంపమని "రాజా"ను
నాయనగారు అన్నముతినుచు
"నాయనా! రాజా! రా! రా! రా!"
అంటూ పిలిచి అన్నము పెట్టి
పాటశాలకు పొమ్మనెను.
"నాయనగారూ! పాఠశాలకు
నేనెందులకు పోవాలి?"
"బాగుగ చదివిన పిల్లలె రేపటి
భారత దేశపు నాయకులు"
"నాకు వద్దు ఆ నాయకపదవి
నన్ను మీరలు చంపొద్దు"
"అయితే కలెక్టరు పదవికి నీవు
అర్హుడగుటకు చదివెదవా?"
"వద్దు వద్దు ఆ కలెక్టర్ నాకు
వద్దు నాయనా! ఓనమాల్!"
"డాక్టరు పదవికి ఢిల్లీలోన
డంబము మీరగ చదివెదవా?"
"డాక్టర్ - మందు - నాకొద్దబ్బా
దండము పెట్తా మన్నించు"
"వకీలు చదువుకు బి. యల్. చదివి
నల్ల కోటులను తొడిగెదవా?"
"వకీలు వద్దు - క - కాలు వద్దు
వద్దు నాయనా - అ - ఆ - లు"
"అయితే నీవు యేమిచేసెదవు?
"అల్లరి 'రాజా' - నా రోజా!"
బడికి పోవుట మానియు నేను
బంతులాడుతూ వుండెదను
ఆటలాడుతూ వుండేనాకు
ఆకలికూడా కాదయ్యా!"
అంటూ 'రాజా' చెప్పుటవినగా
అమ్మా - నాన్నకు నవ్వొచ్చె
బాలల మాటల అమాయికత్వము
బాగుగవింటే తెలియుకదా?

# బిడ్డలు - తల్లిదండ్రులు

## క్రీడ

శ్రీ కె. వెంకట్రామయ్య

**బడివయస్సునకు పూర్వము బిడ్డయాట లక్షణములు** (Characteristics of the play of the pre-school child)

బిడ్డ రెండుమూడేండ్లవాడు కాగానే క్రీడయందు సాహసమును జూపనారంభించును. ఎత్తులెక్కగోరును. వంకెనగా సమర్చిన బల్లలపై ప్రాకగోరును. మెట్లపైనుండి దుముకుటకు ప్రయత్నించును. చీకటి స్థలములందు వెదుకబోవును. కేకలువేయుచు పరుగెత్తును. బిడ్డ యాడెడి యాటలన్నిటికిని పెద్ద కండరముల నుపయోగించెడి యవసర మెక్కువగా కలుగుచుండును. అందుచే నీ వయస్సు బిడ్డలకు బయట నాడుటకు వీలుగ తగినంతస్థలముండవలెను.

మూడేండ్లవయస్సు బిడ్డలకు ఏకాగ్రతలేదని తల్లిదండ్రులాందోళనపడుటయుకద్దు. బిడ్డ ఏకాగ్రత జూపకుండుటకు ఆటవస్తువుల నెక్కువగా నిచ్చుటయో, పెద్దలు వారి యాటలలో జోక్యము కలిగించుకొనుటయో కావచ్చును. ఐనను వారికేకాగ్రతలేకుండుట సహజమేయగును. 3, 4 ఏండ్లు వచ్చువరకును బిడ్డల మనస్సంతయు చంచలమైయుండును. వారిదృష్టి దేనిపైనను ఎక్కువకాలము నిలువదు. ఒకదానిపై దృష్టి నిలచియుండుట మరియొకటగుపడువరకేయై యుండును. బాహ్య ప్రపంచము వారికి చాల వింతగొలుపుచుండును. వారనుక్షణమును పరిసర పరిశీలనా ప్రయత్నములనే సలుపుచుందురు. అందుచే వారి దృష్టి ఏయొకదానిపైనను ఎక్కువకాలము నిలువదు. కాని బిడ్డలు మూడేండ్లు నిండగనే ఏదో యొకయాటయందు (ఉ॥ కర్రఘనములతో కట్టెడి యాట) ఇరువది నిమిషములేకాగ్రత జూపగలిగి యుండవలెను. నాలుగేండ్లు నిండగనే అరగంటకుపైగా నేకాగ్రత జూపవలెను. కాని ఇంతకాలమేకాగ్రతను జూపుట తమ కిష్టమగు నొక పనియందు తప్ప అన్నిటియందును జూపజాలరు.

బిడ్డకు మొదట తానొక యాట నాడవలెననెడి యుద్దేశముండదు. ఇంద్రియములను బట్టియే ఆట సాగుచుండును. అతడొక ఊగుడు గుర్రమును (Saw-horse) జూచి దానినెక్కి ఊగ నారంభించును. కర్రఘనములనుజూచి కట్టుటకారంభించును. ఆ కట్టుటలోనే యుద్దేశమును లేక, యేదో రూపము తేలును. అది బిడ్డకు తోటగనో కారు షెడ్డుగనో తోచవచ్చును. మూడేండ్లు దాటినది మొదలు బిడ్డ ఉద్దేశముతో నాడుట కారంభించును.

బిడ్డ లారంభమున నేవో కొన్ని గజిబిజి రూపములను గీయుచు, కట్టుచు ఆడుచుందురు. ఆ యాట మన కుద్దేశరహితముగా నగుపడవచ్చును. కాని దాని మూలముననే తామికముందు చేయనగు క్రీడ వ్యాపారముల కవసరమగు వస్తువులనువాడుట నేర్చుకొనుటయు, కండరముల నిపుణతను (Muscular skill) బొందుటయు జరుగుచున్నవి. ఇంతేగాక కట్టుట, గీయుట (drawing) ద్వారా తమకు తెలిసిన విషయములను వ్యక్తముచేయవచ్చునని బిడ్డలు గ్రహింతురు. బిడ్డలు మొదట వస్తువులనుచూచి చెప్పగలరేగాని మానసికముగ నూహించుకొనజాలరు. అందుచే వారావస్తువులరూపములను సరిగా చిత్రించుటయు, నిర్మించుటయు చేయజాలరు. ఒక వస్తువు బొమ్మను గీయుటకు చేతినిపుణత యవసరమేయైనను దానిని సరిగా మనమున నూహించుకొనగలుగుటయు చాల ముఖ్యమే. చేతి నిపుణతలేకయే తాము బొమ్మలను గీయజాలకుంటిమని చాలమంది తలంచుచుందురు. కాని ఇది వట్టి పొరబాటు. వస్తురూపమును సరిగా నూహింపజాలకుండుటయే కారణమని వారు గ్రహింపవలెను.

వస్తువులను మొదట సరిగా పరిశీలించినగాని బిడ్డలు వాని బొమ్మలను గీయుటకు తగిన మానసిక చిత్తరువులను నిర్మించుకొనజాలరు. వారొక బొమ్మను

సరిగా గీయనపుడు తప్పినదని చెప్పరాదు. నిజరూపమునుగాని దాని చిత్రమునుగాని వారికి చూపవలెను. అప్పుడు వారి తప్పును వారే గ్రహింతురు. బిడ్డలు తాము చూచెడి జీవిత విషయములను మూర్తిరూపమునను, నటనారూపమునను, ప్రదర్శింప ప్రయత్నించుచుందురు. అట్టి ప్రయత్నములవలననే వారి పరిశీలనాశక్తి వృద్ధి బొందును. కచ్చితముగు మానసిక చిత్తరువులను వారు నిర్మించుకొనగలుగుదురు.

3, 4 ఏండ్లవయస్సు బిడ్డల క్రీడానురక్తులు (Play interests) పెంపొందు విధానము కడువిచిత్రముగా నుండును. బిడ్డల కెక్కువ సన్నిహితులైనవారు వారి తలితండ్రులేగదా. కనుక, తమయాటలలో బిడ్డలు తలిదండ్రులనే మొదట యనుకరించుచుందురు. తదుపరి ఇంటియందు పనిచేయువారిని, ఇక కొన్నాళ్లకు వీధులలోన నమ్మువారిని, పోలీసువారిని, బండ్లునడుపువారిని, అనుకరించుచుందురు. తావులలో నున్నయెడల పడవలను వంతెనలను కట్టుచు ఆడుకొందురు.

బిడ్డ ఎదిగెడి కొలదియు వారి యాటలలో నటనా ప్రదర్శన మభివృద్ధి గాంచుచుండును. మొదట వారు బొమ్మలను సజీవముగ నూహించుకొని సంరక్షణ సలుపు రీతిగ నాడుచుందురు. అటుపై "ఆసుపత్రులు" "టీ - పార్టీలు" మొదలగు వానిని గూర్చియాడుదురు. బిడ్డతానొక్కడే యాడుచున్నయెడల అన్ని పాత్రలను తానేయగుచు నాడును. ఇతరులతో కూడి యాడునపుడు ఆ యాట ఒక నాటికగా తయారగును. బిడ్డలకు రైలు ఆటపై మొదటిసారిగ మక్కువకలిగెననుకొనుడు; అప్పుడువారు కుర్చీలను (క్రఘనముల?) నొకదాని వెనుకనొకటినుంచి త్రోయుచు సంతృప్తి నొందుదురు. అటుపై ఆ రైలునే ఇంకను బాగుగా నిర్మించుకొనిగాని ఆడుట కారంభింపరు. ఇక కొన్నాళ్లకు ఆ యాటనే ప్లాటుఫారములు, సిగ్నలు స్తంభములు, వంతెనలు మొదలగువానిని గూడకట్టి యాడుచుందురు.

బిడ్డలకు పదేండ్లు గడచువరకును, వారియాట పైవిధముననే పెంపొందుచు వారికెంతయు నుపకరించియుండును. ఆ యాటవలన వారికి స్వశక్తిపై నాధారపడుట (Self - dependence) యలవడి ఇతరుల ప్రసక్తిలేకయే ఉల్లాసముగనుండగలుగుదురు. మరియు వారి బుద్ధి కుశలత (ingenuity), ఉపాయత (resourcefulness), ఊహాశక్తి (imagination), తార్కిక బుద్ధి (reasoning), జ్ఞానేచ్ఛ పెంపొందును. నేర్పుతో చేయనగు పనులెన్నో వారి కలవాటగును. ఇట్టి గుణములబ్బుటచే బిడ్డలు తమ బాల్యమునేగాక భావి జీవితమునుగూడ సంతృప్తికరముగ గడుపగలరు.

## సమవయస్కులతో సహవాసము.
## (Companionship of Contemporaries)

బిడ్డల సంపూర్ణాభివృద్ధికి సమవయస్కులగు నితర పిల్లల సహవాసమెంతయు తోడ్పడును. సరిసమానులతోనున్నప్పుడు "ఇచ్చి పుచ్చుకొనుట" (Give and take) యవసరమగును. దానివలన ఇతరులతో సఖ్యతగలిగి చరించుటయలవడును. బిడ్డలు తమకన్న పెద్దవారితో నాడునపుడు తమ చొరవను, ఆలోచనను జూప సంకోచింతురు. చిన్నవారితో నాడిన యెడల ఇతరులు తమ యిష్టప్రకారము నడచుకొనవలెననెడి యుద్దేశము లేర్పడవచ్చును. కాని సమవయస్కులుగాని వారితో బిడ్డల ప్రవర్తన ఎల్లప్పుడు పై రీతిగనే యుండునని ఖండితముగా జెప్పజాలము. కారణమేమన చిన్నపిల్లలే పెద్దపిల్లలపై నధికారము జూపుటయు, వేరువేరు వయస్సుల బిడ్డలు చక్కగాకలసి యాడుకొనుటయు అప్పుడప్పుడు జరుగుచునే యుండును. ఐనను సాధారణముగా ఒకే మానసిక వయస్సుగల బిడ్డలే కలసియాడుట మంచిదని చెప్పవచ్చును.

బిడ్డలొక్కొక్కప్పుడు ఇతర పిల్లల సహవాసమునకై ఇంటినుండి పారిపోవుచుందురు. అట్టివారు సాధారణముగా ఒంటరి బిడ్డలై (only child) యుందురు. లేదా కుటుంబములోని తక్కిన పిల్లలకన్న నెంతో చిన్నవారై యుందురు. అట్టి బిడ్డలనే కిండర్ గార్టెను బడులకో పంపుట మంచిది. అక్కడ వారికి సరియగు సహవాసము లభించి ఆనందముగా నుండగలరు. ఒక్కొక్కప్పుడు తగిన యాటవస్తువులు లేకుండుటచే గూడ బిడ్డలు ఇల్లువదలి బయటకు పోవుచుందురు. తగిన యాటవస్తువుల నిచ్చినచో వారట్లు పోవుట మానగలరు. బిడ్డల వయస్సులనుబట్టి వారికితగిన యాట వస్తువులేవో నికముందు చెప్పబడును.

(152-వ పేజి తరువాయి)

తామిద్దరు చిన్నాయన పెదనాయన బిడ్డలయినా తన తల్లికి పెదనాయన కుమార్తెపట్లగల ద్రోహపు చింతను సహించలేక తల్లి ఆదరాభిమానములకు సయితము దూరమయి ఆమె సౌభాగ్యము నుద్దేశించి యిల్లువాకిలి వదలివెళ్ళి న్యాయాన్ని, ధర్మాన్ని రుజువుచేయడానికి ఒక యువకుడు పడిన కష్టాలు, చేసిన కృషి, సల్పిన వీరోచిత పోరాటము సహజసిద్ధంగా నొప్పినవి.

కథ పొందిక, మాటలు, పాటలు చక్కగా నమరినవి. సంగీతము హృదయ రంజకముగా నున్నది. నృత్యములు, తిరుపతి వేంకటేశ్వరస్వామి ఆలయ దృశ్యములు సామాన్య ప్రజలను ఎంతైనా ఆకర్షించగలవు.

ముఖ్యంగా సి. యస్. ఆర్ నటన పేర్కొనతగింది. జమున, యన్. టి. రామారావు, రమణారెడ్డి సహజంగా నటించారు. రేలంగి హాస్యము సాధారణస్థాయికి పరిమితముగా నొప్పింది. మొత్తం మీద అందరు బాగానే నటించారు.

అన్ని విధాల ఉత్తమ చిత్రంగా 'భాగ్యరేఖ'ను నిర్మించిన డైరెక్టరు శ్రీ బి. యన్. రెడ్డిగారు, నిర్మాతలు పొన్నలూరి బ్రదర్స్ అభినందనీయులు.

—పున్నయ్య

---

విజయా వారి 'మాయాబజార్' చిత్రంలో సావిత్రి, యన్. టి. రామారావు, సి. యస్. ఆర్, యస్. వి. రంగారావు, రేలంగి మున్నగువారు నటిస్తున్నారు. దర్శకత్వము శ్రీ కే. వి. రెడ్డిగారు. సంగీతము ఘంటసాల. చిత్ర నిర్మాణము పూర్తయింది. త్వరలో విడుదలకాగలదు.

◆ ◆ ◆

'దేవసుందరి' తెలుగు చిత్రంలో జానకి, కాంతారావు, అమ్మాజీ, శివరావు మున్నగువారు నటిస్తున్నారు. నిర్మాత శ్రీ మూనాస్. చిత్ర నిర్మాణం చురుకుగా సాగుతున్నది.

◆ ◆ ◆

మాడరన్ థియేటర్స్‌వారి తెలుగు చిత్రం 'వీర కంకణం'లో జమున, జగ్గయ్య మున్నగువారు పాల్గొన్నారు. ఇది యీ నెలలోనే విడుదల కావచ్చును.

◆ ◆ ◆

ఆర్. యన్. ఆర్. పిక్చర్స్‌వారి తెలుగు చిత్రం 'ప్రేమే దైవం'లో శ్రీరంజని, సూర్యకళ, సంధ్య, గుమ్మడి, దేశిరాజు రామారావు, రాజనాల, ఆర్. నాగేంద్రరావు మున్నగువారు నటిస్తున్నారు. దర్శకత్వము శ్రీ ఆర్. నాగేంద్రరావు, సంగీతము శ్రీ హెచ్. పద్మనాభశాస్త్రిగారలు. ఇదికూడ యీ నెలలోనే విడుదల కాగలదని తెలుస్తున్నది.

---

## మంత్రసాని

శ్రీమతి కె. పార్వతి

పిలచిన తోడనే ప్రీతితో వచ్చుచు
సేవలు జేసెడి చెల్లి వమ్మ!
కంటి రెప్పగ వోలె గర్భిణి స్త్రీలను
భాగ్యతతో జూచు భాగ్యరాశి
రేయెల్ల మేల్కొని ఏబాధ పడనీక
కాన్పును చేసెడి కన్నతల్లి
కన్నమ్మ - పశిపాప - కనులలో బెట్టుక
కాచుచు నుండెడి కాంత వీవు!

ఎన్ని జన్మాలు నీసేవ జేసియైన
నీదు ఋణమును తీర్చగ నేరితరము
ఆయురారోగ్య భాగ్యాల నాదరిల్లి
మమ్ము దీవింపుచుండుమా! మంత్రసాని

(120 వ పేజీ తరువాయి)

శ్రీరామ కైంకర్యానికి వెచ్చించి తానీషా క్రోధానికి పాత్రుడై చెరసాలవాసం అనుభవించాడు. తానీషా హిందువులను ఆదరిస్తున్నాడనే ఆవేశంతో ముస్లిం ప్రజ అతనిమీద తిరగబడ్డారు. ఆవిషయం తెలిసి 1687 లో చక్రవర్తి ఔరంగజేబు అనుసరించి దక్కను సుబేదారు గోల్కొండను ఆక్రమించుకొని తానీషాను బందిఖానాలో నిర్బంధించగా, అతడు అక్కడనే క్రీ. శ. 1702 లో మరణించాడు. అప్పటినుంచీ ఈ అసఫ్‌జాహి వంశస్తులే దక్కను కంతటికీ ప్రభువులై, హైదరాబాదును రాజధానీ నగరం చేసుకొని పరిపాలిస్తున్నారు. భారతానికి స్వాతంత్ర్యము సిద్ధించిన వెంటనే, శ్రీ సర్దారు వల్లభాయి పటేలుగారి విడువని ప్రయత్నంవల్ల సంస్థానాలన్నీ భారతంలో విలీనం అయినాయి. కాని; దుండగులై (కమ్యూనిష్టులతో చేరిన) రజాకర్ల అత్యాచారాలను గ్రుడ్లప్పగించి చూస్తూవుండిన ఇప్పటి 9 వ నైజాము ఉస్మానాలీఖాన్ గారు పదవినుంచి విరమించక తప్పిందికాదు. ప్రకృతం రాష్ట్రపునర్విభజన పథకాన్ని అనుసరించి తెలంగాణా ప్రాంతం 'ఆంధ్ర'లో చేరడంతో హైదరాబాదు రాష్ట్రానికి ముఖ్యపట్టణం కావడం తటస్థించింది. ముందుముందీనగరం మహాభ్యుదయాన్ని పొందగలదనే సూచనలు కనబడుతున్నాయి. అస్తు! ఇక ప్రకృతానికి వస్తాం.

సాలారు జంగు వస్తు ప్రదర్శనాంగణం దర్శించుకొని యివతల పడేటప్పటికి సూర్యుడు అస్తంగతుడైనాడు. అదివరకే అక్కడి టిఫిన్ తెచ్చి మా వంటవారు కనిపెట్టుకొని వుండగా, తిరిగి తిరిగి కాళ్ళరిగిన మా బలగందానిమీద కెగబడ్డారు. తరువాత బస్సులెక్కి సికిందరాబాదులోని మాబస చేరుకొని ఆరాత్రి గడిపినాము.

మరునాడు ఆంగ్లులకు ఉగాది. ప్రొద్దున్నే నిత్యకార్యకలాపాలు ముగించుకొని, కాఫీ ఫలహారాల బాకీ తీర్చుకొని, హైదరాబాదు ఆర్యవైశ్య హాస్టలు వారి ఆహ్వానాన్ని అనుసరించి అక్కడికి వెళ్ళినాము. వారెంతో ఆదరించి విస్తృతులం తేనీళ్ళతో మమ్ముల నందరిని తృప్తిపరచారు. అక్కడి అధికారవర్గం — ఆ హాస్టలును పెద్ద ఎత్తున అభివృద్ధి చేయడానికి పూనుకొని పని జరుపుతున్నారు. అందుకను తెలంగాణాలో వుదారులయిన వైశ్యోత్తములు ధారాళంగా విరాళాలు ఇవ్వటం హర్షించ తగిన విషయం. ఆ మోస్తరు మద్రాసులో స్వసంఘోద్ధరణకు వైశ్యులు ముందంజ వేసేయెడల ఒక్క కన్యకాపరమేశ్వరీ దేవస్థాన ధర్మ సంస్థకే ఎదురుచూడవలసిన పని వుండదు. ఇంతకూ త్యాగబుద్ధి కలగటం ప్రధానం. పట్టుదలతో స్వ సంఘోద్ధరణకు పాటుపడటం తరువాతది. ఈ రెండూ వున్నయెడల కాని కార్యము నేడి వుండదు.

మేమూ హాస్టలునుంచి "ఉస్మానియా యూనివర్సిటీ" భవనాలకు వెళ్ళాం. అక్కడి ఆయా శాఖల్ని సందర్శించాం. ఇది ఒక దివ్యమయిన కట్టడం. కొన్ని విషయాలలో ఇది భారత దేశంలోని తక్కిన విశ్వ విద్యా సంస్థలకు ఆదర్శప్రాయ మనక తప్పదు. అక్కడనుండి మేము గోల్కొండ దుర్గం చూడాలని వెళ్ళాం. అదేమి కోట? అవేమి నగళ్ళు? విశాలంగా వుండే పంచపాళీలు! దిట్టంగా కట్టబడిన దర్వాజాలు! విస్తీర్ణములయిన కూటాలు! ఒక భాగంనుంచి మరొక భాగానికి పొయ్యే దారులు! వచ్చిన త్రోవ యేదో, పోవలసిన మా మార్గం యేదో తెలియని భవంతులు! నిట్టనిలువున పైకి వెళ్లేకొద్దీ, రాచనగళ్లు, రాణివాసాలు, సభామంటపాలు, సేనానివేశనాలు, జలాశయాలు! ఒకటేమి? పాతకాలపు చరిత్ర విశేషాలను ప్రకటించే మూగనోముగల అక్కడి ప్రతిశిలాఖండం ప్రేక్షకులను నిర్విణ్ణులను చేసే శక్తిగలది. కోట నడుమ గుట్టమీది భాగంలోని చెరసాలలో రామదాసానాడు నిర్బంధింపబడినాడని అక్కడి జన ప్రవాదం. బంధనాగారపు గోడలోని రంధ్రం గుండా గోపన్నకు ఆహార పానీయాలు

సరఫరా చేసేవారట. ఆ రంధ్రం ఇప్పటికీ కనబడుతుంది.

తరువాత 12-30 గంటలకు మేము అక్కడనుంచి గండికోట సరస్సు వీక్షించటానికి వెళ్ళాం. ఇది ప్రకృతిమాత ప్రేక్షకులకు నివ్వాళు లివ్వటానికి చేత ధరించిన పళ్ళెం మోస్తరు మెరుస్తూ వుంటుంది. ఈ పెద్ద చెరువు చుట్టిరావాలంటే దాదాపు 5 గంటల కాలమయినా పడుతుంది. దీనికి బాహాటమయిన వరవలు, కలుజులు వున్నాయి. చల్లని అమృతోపమానమయిన నీటితో తన్ను చూడవచ్చిన వారి దగ తీర్చి హాయి మనిపిస్తుంది. చెరువుచుట్టూ చిన్న చిన్న చెట్లు, దుబ్బులు, లతలు అల్లిబిల్లిగా అల్లుకొన్న చిట్టడివి కండ్లకు విందు కొలుపుతూ వుంటుంది. సరస్సు సమీపంలోనే చెట్ల నీడల్లో భోజనాలు ముగించుకొని తిరుగు ప్రయాణం చేయుటంలో రాజభవన్, కొన్ని ప్రభుత్వ కార్యాలయాలు, చూస్తూ, హుసేన్ సాగర్ తీరంగుండా మా క్యాంపుకు చేరుకొన్నాం.

మాయాత్రా కార్యక్రమం ఇంతతో ముగిసినందున, వంట పనులు పెట్టుకొంటే కాలాతీత మవుతుందని, విజయవాడ మీదుగా పోయే 5 గంటల బండికి మా పరకులు జప్రాలతో సికిందరాబాదు స్టేషను చేరి రిజర్వుడు కంపార్టుమెంటును ఆక్రమించుకొని బిచాణాలు వేశాం. రాత్రి భోజనాలు లేనందున అందరికీ అరటిపండ్లు పాలు సప్లయి చేయుబడింది. ఇంతలో చీకటి పడింది. దీపాలూ వెలిగాయి. తీరా బండి కదిలే సమయానికి సూటు బూట్లు ధరించి 'హ్యాండు బేగు'తో పెద్దమనిషివలె కనబడే ఆసామీ ఒకడు మా పెట్టెలో ఎక్కి, అప్పుడే పడుకున్న పిల్లలను త్రొక్కుకుంటూ చోటుకోసం తాపత్రియపడటం చూసి, మా వాళ్లు కొందరు అటకాయించారు. దాంతో ఆ పెద్ద మనిషికి కోపం చిమ్మిరేగి, ఏమేమో నోటికి వచ్చి నట్లల్లా బిగ్గరగా అరుస్తూ శివాలాడటం మొదలెట్టాడు. మా రామదండు మాత్రం తీసిపోయిందా ?- ఇక చూసుకొండి ! ఒక పాటలేగాదు ! ఒక ఆటలేగాదు; ఒక కొక్కిరింపులేగాదు; ఒక వెక్కిరింపులేగాదు; ఒక చప్పట్లేగాదు; ఒక నూటి పోటి మాటలేగాదు ! అతణ్ణి ఏడిపించి బొక్కలాడేరంటే నమ్మండి. "ఎందుకు ఎందుకు ఈ పెట్టెలోకి ఎక్కేమురా భగవంతా !" అని అతడేడ్చేటట్టు చేశారు. ఖాజీపేటలో నేమో అతడు దిగి మా పిల్లల చెర తప్పించుకున్నాడు. మా ట్రెయిను విజయవాడకు ఉదయం 7.15 గంటలకు చేరగానే అల్పాహారాలు కాఫీ ఆప్యాయంగా పుచ్చుకున్నాం. మా పెట్టె, కలకత్తా మద్రాసు జనతా ఎక్స్‌ప్రెస్సుకు తగిలించబడింది. ఒంగోలు స్టేషనులో మధ్యాహ్న భోజనం ప్లాటుఫారం హోటలు ప్యాకట్లతో సరిచేసుకున్నాం. నాటిదినం 'జనతా'- 3 గంటల ఆలస్యంతో రాత్రి 9.45 గంటలకు సెంట్రలు స్టేషనుకు చేరుకుంది. అవరకే మధ్యాహ్నం నుండి తమ పిల్లలకై కనిపెట్టుకొనివున్న తలిదండ్రులు సంరక్షకులు వాళ్ళని చూడగానే మహదానంద భరితు లయినారు.

ఈ విధంగా మా వినోదయాత్ర జయప్రదంగా నెరవేరటానికి సహకారులైన వుపాధ్యాయులూ, ప్రధానోపాధ్యాయులైన శ్రీ యం. నరసింహాచార్యులు, కరెస్పాండెంటు శ్రీ టి. హరికృష్ణ శ్రేష్ఠిగార్లు ప్రస్తుతి పాత్రులు. మాకు ప్రయాణ సౌకర్యాలు, తక్కిన అనుకూలాలు సమకూర్చిన శ్రీ యం. రాజగోపాలు బ్రదర్సు (మదరాసు); బండా బ్రదర్స (బొంబాయి) శ్రీ పటేలుగారు (ఔరంగాబాదు) శ్రీ నాగేంద్ర, శ్రీ రంగనాథము శ్రేష్ఠిగార్లు (హైదరాబాదు) మున్నగువారికి మా కృతజ్ఞతాభివందనాలు. ఈ యాత్రాంశాలు సమగ్రంగా "గృహలక్ష్మి" లో ప్రచురించినందుకు మా హృదయ పూర్వకాంజలులు.

పెనుకొండ శ్రీ వాసవ కన్యకాంబ సర్వదా శుభములొసంగుగాక !

# ఉగాది



శ్రీ మండ రామారావు

గతమంతా గడచినది
కాలమంతా మారినది
వసంత మేతెంచినది
చైత్రమునే తెచ్చినది

ఉగాది పండుగ వచ్చినది
ఆహ్లాదమునే యిచ్చినది
బాలలందరకు పంచినది
దేశానశోభలు జల్లినది

మల్లె మొల్ల విరజాజి
మస్తుమస్తుగా పూచినవి
మందమారుతములు వీచి
మది పులకింప జేసినవి

ప్రభాతమున లేచారు
పూవులెన్నో కోసారు
తోరణాలు కూర్చారు
స్నానములే చేసారు

పురోహితులు వచ్చారు
పంచాంగము విన్పించారు
గ్రహచారము నుడివారు
కానుకలు గైకొన్నారు

పిన్నల పురోభివృద్ధులు
పెద్దలు ఆకాంక్షిస్తూ
ధర్మమార్గము ఉపదేశిస్తూ
ఆశీర్వాదాల్ చేసారు

# సంపాదకీయములు

## కేసరి విద్యాలయములు

మద్రాసు నగరంలోని తెలుగు బాల బాలికలకు మాతృభాషలో విద్యావసతులకుగాను స్థానిక ఆంధ్ర ప్రముఖుల సహకారంతో మైలాపూరునందు మొట్టమొదట తెలుగు ఎలిమెంటరీ స్కూలు స్థాపించబడింది. ఆ విద్యాలయ నిర్వహణకు కీ॥ శే॥ డాక్టరు కే. యన్. కేసరిగారు పూనుకొని దానిపట్ల వారు చూపిన ఆసక్తి, దాని అభివృద్ధికిగాను ఆయన ఏర్పరచిన రెండులక్షల రూపాయల నిధి తెలుగు ఎలిమెంటరీ స్కూలు క్రమంగా హైస్కూలుగా రూపొందడమేకాక త్యాగరాయనగరులో సయితం కేసరి మిడిల్ స్కూలు, ఎలిమెంటరీస్కూలు ఏర్పడి అవిచ్ఛిన్నముగా వృద్ధికాజొచ్చినవి. కాని రాష్ట్రముల పునర్నిర్మాణము ఫలితముగా ఆంధ్రప్రదేష్ నిర్మాణము, ఆంధ్ర హైకోర్టు, ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయములు మద్రాసునుండి తరలింపబడుటతో ఆంధ్రుల జనాభా తగ్గుటచే స్థానికాంధ్రులు కేసరి విద్యాలయముల పురోభివృద్ధిపట్ల మరింత ఆసక్తి చూపి సహాయపడవలసి ఏర్పడినది.

కేసరి విద్యాలయముల వార్షికోత్సవ సందర్భమున మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులు శ్రీ పి. వి. రాజమన్నారుగారు చెప్పినట్లు ఆంధ్రప్రదేష్ విడిపోయినందువలన యీ విద్యాలయముల ఆవశ్యకత తీరిపోలేదు. కాబట్టి మద్రాసు నగరంలోని తెలుగువారు కేసరి విద్యాలయములను తమబిడ్డలకు మాతృభాషలో విద్యావసతులకు వినియోగించుకుంటూ భూరి విరాళములిచ్చి పోషించి పురోభివృద్ధిని ప్రోత్సహించవలసియున్నావని శ్రీ పి. వి. రాజమన్నారుగారు చేసిన విజ్ఞప్తి గుర్తించతగినది. రాష్ట్రేతర ప్రాంతములైన ఢిల్లీ బొంబాయిలాంటి నగరాలలో తెలుగు బాల బాలికలకు మాతృభాషలో విద్యావసతులకుగాను ఆర్థిక సహాయము చేయుచున్న ఆంధ్రప్రదేష్ ప్రభుత్వము నిన్న మొన్నటిదాక ఉమ్మడి రాష్ట్రంగా మద్రాసుతో కలసియున్న ఆంధ్రప్రదేష్ యిప్పుడైనా రాష్ట్రేతరాంధ్రులైన మద్రాసులోని తెలుగువారి విద్యావసతులపట్ల ఆసక్తిచూపి కేసరి విద్యాలయములకు, యితర తెలుగు విద్యా సంస్థలకు ఆర్థిక సహాయం చేయగోరుచున్నాము.

## కాశ్మీరు వివాదం

కాశ్మీరు రాజ్యాంగ చట్టరీత్యా భారతదేశంలో అంతర్భాగమై తోడి రాష్ట్రాలతోబాటు అభ్యుదయ పురోగామిగా నుండగా పాకిస్తాను ఏ విధంగానైనా కాశ్మీరును కబలించాలని ఉబలాట పడుచుండుట ఉడుకుమోతుతనం తప్ప మరేమి కాదు.

ఏనాటి కావాడు కూడు గుడ్డ సమస్యల దగ్గరనుండి, జాతీయ అంతర్జాతీయ రంగాలలో తప్పటడుగులు వేస్తున్న పాకిస్తాన్‌కు యీ ఆరాటం ఎందుకో అర్థంకాదు. అమెరికా సహాయంతో భారతదేశంపై దాడిచేయ సమకట్టినచో దాని ఫలితాలను పాకిస్తానే కాకుండా దానికి చేయూతనిస్తున్న రాజ్యాలు అనుభవించక తప్పదు. మానవ శ్రేయస్సుకు ప్రపంచ శాంతి యవసరమని గుర్తించి భారతదేశము చేస్తున్న కృషిని యావత్ప్రపంచ ప్రజలు అర్థం చేసికున్నారు. కాశ్మీరు సాకుతో ప్రపంచ శాంతికి ముప్పు మొచ్చినచో దానికి పూర్తిగా పాకిస్తాను బాధ్యత వహించవలసి యుంటుంది.

—o—

ఆమె
రూపవతి

కాని, గర్భాశయ రోగములు ఆరోగ్యమును క్షీణింపజేయుట వల్ల ఆమె జీవిత సౌఖ్యమును అనుభవించలేక సంతాన సౌభాగ్యమును పొందలేక పోవుచున్నది.






# అరుణ
## గర్భాశయ రోగనివారిణి

స్త్రీలకు ప్రత్యేకముగ కలిగెడి వ్యాధులన్నిటిని పారద్రోలును

**ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్, మదరాసు - 17**

---

మొదడును చల్లబరచి
శిరోజములను నల్లబరచి
కురుల్లను పదిలము చేయునది

కేసరిగారి

# భృంగామలకతైలము

**వెల రు. 2**

వాడండి.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

**రాయపేట, మద్రాసు 14.**

## శ్రీ దుర్ముఖినామ సం॥ర ఫాల్గుణమాసము

| నెల | తేదీ | వారం | వివరాలు |
|---|---|---|---|
| 1957 సం॥ మార్చి నెల | 16 | శ | ○ పౌ 4.36 ఏప్యం 54-15 ఉఫ 37.57 త్యా 3.48 |
| | 17 | ఆ | కృ విదియ 54-10 హ 34.45 త్యా 3.51 |
| | 18 | సో | తదియ 50.31 చి 32.29 |
| | 19 | మం | చ 47.59 స్వా 31.18 |
| | 20 | బు | పం 46.42 విశా 31.19 త్యా 4.5 |
| | 21 | గు | ష 46.39 అనూ 32.31 త్యా 4.10 |
| | 22 | శు | స 47-49 జ్యే 34-56 త్యా 4.14 |
| | 23 | శ | అ 51.6 మూ 38.27 |
| | 24 | ఆ | న 53.20 పూషా 42-56 త్యా 4.18 |
| | 25 | సో | ద 57.20 ఉషా 48.11 |
| | 26 | మం | ఏ 60.10 శ్ర 53.57 |
| | 27 | బు | ఏ 1.55 ధ 59.59 |
| | 28 | గు | ద్వా 6-38 శత 60.10 త్యా 4-25 |
| | 29 | శు | త్ర 11.16 శత 6.1 |
| | 30 | శ | చతు 15-33 పూభా 11.42 |
| | 31 | ఆ | ● అమా 19.14 ఉభా 16.49 |

## శ్రీ హేవళంబినామ సం॥ర చైత్రమాసము

| నెల | తేదీ | వారం | వివరాలు |
|---|---|---|---|
| 1957 సం॥ ఏప్రిల్ నెల | 1 | సో | పా 22-5 రే 21-9 త్యాజ్యాభావః శూన్యతిథి, తెలుగు సంవత్సరాది |
| | 2 | మం | విది 23-55 అశ్వ 24-30 త్యా 4-14 రా 12-57 త్యా 4.9 |
| | 3 | బు | తృ 24.35 భ 26.43 త్యా 4-5 సౌభాగ్య గౌరీవ్రతం |
| | 4 | గు | చ 23-59 కృ 27-44 |
| | 5 | శు | పం 22.9 రో 27-3 త్యా 4-0 రా 10-36 త్యా 3.55 |
| | 6 | శ | ష 19-6 మృ 26-6 త్యా 3.51 |
| | 7 | ఆ | స 14.59 ఆర్ద్రా 23-39 త్యా 3-47 భానుసప్తమి |
| | 8 | సో | అ 9-56 పున 20-18 త్యా 3-44 శ్రీరామనవమి |
| | 9 | మం | న 4.10 ఏప్యం 53-47 పున 16-9 ధర్మరాజదశమి |
| | 10 | బు | ఏ 51-23 ఆశ్లే 11-53 డోలోత్సవం, స్మార్తైకాదశి |
| | 11 | గు | ద్వా 44-54 మ 7-19 మాధ్వ, రామానుజైకాదశి |
| | 12 | శు | త్ర 38-47 పూఫ 2-52 ఉఫ 55-45 |
| | 13 | శ | చతు 33-16 హ 55-12 త్యా 3-47 సౌరవత్సరాది, విషువత్పుణ్యకాలం |
| | 14 | ఆ | ○ పౌ 28-33 చిత్త 52-41 చిత్రాపూర్ణిమ |
| | 15 | సో | కృపా 24-49 స్వా 51-16 త్యా 3-55 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.

లోధ్రలో హానికరమైన వేవీ లేవు. సుఖప్రదమైన జీవితానికి ఆరోగ్యాన్ని చేకూర్చడానికి అది గట్టి మందు. కెమిస్టు లందరి వద్ద దొరుకుతుంది.

లోధ్ర స్త్రీల దివ్యౌషధం

కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.
రాయపేట - మదరాసు - 14.






## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఒరిస్సా, ఆంధ్ర ప్రదేశ్ కు ఏజంట్లు :
శీతారాం జనరల్ స్టోర్సు, బరంపురం, విజయవాడ & సికిందరాబాద్